శ్రీ రామాయనమః

# భక్తనిత్యచర్య

( హిత చర్యలు )

విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

వాసుదాస స్వామి



శ్రీ రా మ సే వ.

# శ్రీ కో దం డ రా మ సే వ క స మా జ

# ని య మ వి వ ర ణ ము

## భక్తనిత్యచర్య ప్రథమ ద్వితీయ సోపానములు



వావిలికొలను సుబ్బరాయ
విరచితము

ప్ర కా శ కు లు.

శ్రీ కో దం డ రా మ భ క్త సే వా స మి తి
శ్రీరామసేవాకుటీరము
ఒంటిమిట్ట, కడపజిల్లా.

## WARNING

## హె చ్చ రి క

======

ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావుగారి గ్రంథములకు లభించిన ప్రశస్తిగాంచి కొందఱు తమగ్రంథములకు వారు వారిగ్రంథముల కుంచినపేర్లే– "ఆంధ్రవాల్మీకిరామాయణము""కృష్ణావతారతత్త్వము" యని పేర్లుంచుచున్నారు. సుబ్బరావుగారి పుస్తకములను బంపుఁడని వ్రాసిన కొందఱకు గొందఱపుస్తకముల నమ్మువారు ఇతరుల రచించిన పుస్తకములను వి. పి. గాఁ బంపి యుత్తరములందు సుబ్బరావుగారిపుస్తకములనే పంపినట్లు వ్రాయుచున్నారని మాకువచ్చిన యుత్తరమువలనఁ దెలియుచున్నది. కాఁబట్టి సుబ్బరావుగారి పుస్తకములఁ గొనఁగొరువారు హెచ్చరిక కలిగి వర్తింపవలయునని ప్రార్థించుచున్నాము. అటు కాదేని మాకే వ్రాయవలెను.

శ్రీ కో ద ం డ రా మ భ క్త సే వా స మి తి
శ్రీరామసేవాకుటీరము
ఒంటిమిట్ట, కడపజిల్లా.

# శు భ వా ర్త.

శుష్కవేదాంత రాక్షసమాయా మోహితులైన వారిని బునరుజ్జీవింపఁజేయ రామదాస సంజీవరాయఁడు భక్తి సంజీవనిని దెచ్చి యిచ్చుచున్నాఁడు : వివేకులు త్రాగుఁడు.



మాయాయోగ శుష్కవేదాంత ధ్వాంతనిశాంత పద్మినీకాంతుఁడు హనుమంతుఁడు భక్తి సంజీవనిఁ డెచ్చుట.

ఈ సమాజసభ్యు
లీ ప్రథమ సోపానమును
జదివి స్మరణచిహ్నము ధరించి
తెలిపిరేని వారికి నంగీకారపత్రము పంపఁ
బడును, అంతవఱకు సభ్యులుగా నెన్నఁబడరు.
ప్రత్యుత్తరములకై 0-1-0 బిళ్ళ పంపు
చుండవలయును. అటు చేయని
వారికిఁ బ్రత్యుత్తరము
లోసఁగఁబడవు.

శ్రీరామసేవ

# శ్రీ కో ద ం డ రా మ సే వ క స మా జ
# ని య మ వి వ ర ణ ము

==========

ఈ సమాజనియమములు క్లుప్తవాక్యంబుల నుండుటచే నిసమాజమున సభ్యులుగాఁ గోరువారల కుఁగొన్నివిషయంబుల సందేహంబులయ గలుగకుండుటకై యీవివరణము వ్రాయవలసివచ్చెను.

## సమాజస్థాపనమునకుఁ గారణము.

పరమతవ్యాప్తివలనను,స్వమతజులైనను పల్లెలందును,బట్టనములందును,గల్లకపటములు మాయమర్మములు తెలియక తెల్లనివన్ని పాలనియు నల్లనివన్నియు నీళ్లనియుఁ దలంచుచు భక్తిశ్రద్ధలు గలవారగుటచే సద్గురూప దేశముచేఁ దరణోపాయమును నెఱుఁగఁగోరి చెప్పెడువారులేమిఁ దమవేషభాషలఁబట్టి దమ్ము విశ్వసించి యాశ్రయించు ముగ్ధులను ముగ్ధురాంద్రను నమ్మఁబలికి యభయలోక భ్రష్టులఁజేసి వారిధనమును శీలమును జెఱుచు శుష్కవేదాంతులవలనను,దుష్కామయోగులయిన యోగులవలనను,ముక్తికాంతకు నర్మసఖి యగుభక్తికన్య నవయుచుండుటఁ జూచి రాఁగలవిపత్తునుండి దేశప్రజలను రక్షించి భక్తిని బునరుజ్జీవింపఁ జేయువలయునను తలంపే యీ సమాజస్థాపనమునకుఁ గారణము.

## స మా జో ద్దే శ ము.

పైవిపత్తునుండి తప్పించి దేశప్రజలకుస్వరాజ్యస్వారాజ్యమోక్షసామ్రాజ్యమీయఁగలిగినది భక్తియే కాని యేతొండుగాదు ఈ భక్తియే మోక్షకారణములందు శ్రేష్ఠ మైనదని "మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ"యని శ్రీశంకరాచార్యులవారు చెప్పిరి. మోక్షసాధనమున కని భక్తిచేసినచో నీలోకసుఖములును లభించు నని ప్రమాణము గలదు.

శ్లో ॥ శరీరారోగ్య మర్థాంశ్చ, భోగాం శ్చైవానుషంగికాన్
దదాతి ధ్యాయినాం నిత్య, మపవర్గప్రదో హరి."

తన్ను ధ్యానించువారికి మోక్ష మిచ్చు నారాయణుఁడు శరీరారోగ్యము–ధనము–వాని ననుసరించి వచ్చు భోగములను గూడ నిచ్చునని యర్థము.

తన్నాశ్రయించినవానికి మండలాధిపత్య మీయఁదలఁచియుండుప్రభువు గ్రామాధిపత్య మీయ వెనుదీయునా?కావున భక్తివలన నిహపరలోక సౌఖ్యములును గలవనుట నిశ్చయము. తక్కిన సాధనములకంటె భక్తి యెట్లు శ్రేష్ఠమైనది. తెలియఁగోరువారు శ్రీకృష్ణావతారతత్త్వము గాని భక్తి ప్రాశస్త్యమును గ్రంథమును గాని చూడవలయును. ఇహలోకసౌఖ్యములు గోరువారికిని భక్తి యవశ్యమైనదే. భక్తి లేకున్న దైవానుగ్రహములేదు. దైవానుగ్రహములేక శుభము లేదు. కావున సమస్త జనులకు భక్తి సేవ్యము.

కావున ననుష్ఠింప నిచ్ఛలగలవారికి భక్తివిషయము సాంగముగ సమగ్రముగఁ దెలుపవలయుననుటేయీసమాజోద్దేశము. నిశ్చిత శీఘ్రఫలధనము భక్తియే. నిశ్చియముగా శీఘ్రకాలమున మోక్ష మిచ్చునది భక్తియే. భుక్తిని ముక్తిని రెంటినిచ్చునది భక్తియేకాని జ్ఞానముగాదు యోగముకాదు.

చం. తనకులధర్మమున్ విడిచి దానవవైరిపదారవిందముల్
పనివడి సేవచేసి పరిపాకమునొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన మఱుమేననైన నది సిద్ధి వహించు. భాగవతము.

చాలినంతభక్తి చిన్నప్పటినుండి చేయువారికి నీ దేహాంతమందే ముక్తిగలదు. అటుగాక పెద్దవారై ప్రారంభము చేయుట చేతనో సోమరితనముచేతనో పూర్తిగఁ జేయనివారికి మఱుసటి జన్మంబున ముక్తి తప్పదు.

శ్లో . తేషా మహం సముద్ధర్తా, మృత్యుసంసారసాగరాత్
భవామి నచిరా త్పార్థ ! మయ్యావేశితచేతసామ్. భగ12

చలింపనిభక్తితో నెవరు నన్ను ధ్యానించుచు నుపాసింతురో యట్టి నాయందు మనస్సుంచిన వారిని మృత్యుస్వరూపమైన సంసారమునుండి శీఘ్రకాలమునందే యుద్ధరించెదను." అని యర్థము.

బహూనాం జన్మానా మంతే, జ్ఞానవాన్ మాం ప్రపద్యతే.

అనేక జన్మములకడపట జ్ఞానవంతుఁడు నన్నుఁగూర్చి భక్తిచేయును. ఇది జ్ఞానమార్గ మవలంబించు వారి స్థితిగతు లిట్లుండ మాయవేషములువేసి తెలియనివారిని మాయమాటల మోసగించి యుభయలోకభ్రష్టులఁ

జేయు మహాపాతకులేగతులఁ బోదురో,ఇఁక నిజమైన యోగులగతిఁ జూడుఁడు.

శ్లో . ప్రయత్నా ద్యతమాన:స్తు , యోగీ సంశుద్ధకిల్బిషః
అనేకజన్మసంసిద్ధ, స్తతో యాతి పరాంగతిమ్.

ప్రయత్నపూర్వకముగ యోగము సాధించుయోగి పాపరహితుఁడై యనేక జన్మములవలన సిద్ధుఁడై యావలఁ బరమపదమును బ్రాపించును.యాయ యోగు లెందుఁబోదురో.

యోగులకు జ్ఞానులకు భక్తి యుండిననే యెన్నివేల జన్మములకైన భక్తి సాహాయ్యముచే మోక్షము కలదు గాని లేనియెడల నవి గారడివిద్య లగును.

నిరపాయము:- భక్తియోగము సాధించువారి కేయపాయము కలుగదు.యోగజ్ఞానములందు రెంటను సపాయము కలుగకుండుట చిత్రము, గోవువెంటఁ దగులుకోడెభంగి భక్తుని వెంట భగవంతుఁ డుండును.

నిరాయాసము:- భక్తిమార్గమందుఁ దక్కినవాని యందువలె నేమాత్రము గాసిలేదు.

## ని య మ ము లు.

1. యోగ్యతగల గురువు :- యోగ్యతగల గురువే శిష్యుని నుద్ధరించునుగాని అయోగ్యుఁ డగుగురువు తాను జెడి శిష్యులను జెఱుచును.ఈఁద నేర్చినవాఁడు తాను నది తరించును.తాను దాఁటింపఁబూనిన వానిని దాటించును.ఈఁత రానివాఁడు తాను జెడును.తన్ను నమ్మినవానిఁ జెఱుచును.ప్రతిఫలాపేక్షలేక బోధించువాఁడు ను,తాను జెప్పునది తాననుష్ఠించువాఁడును, తా నుపదేశించు మంత్రమునఁ దాను సిద్ధిపొందినవాఁడును,కామినీ కాంచనాసక్తుఁడు గానివాఁడును శాస్త్రజ్ఞానసంపన్నుఁడును,సాత్త్వికాహారియు,శాంతుఁడు,సదాచారనిష్ఠుఁడును.శిష్య వాత్సల్యము గలవాఁడును,భూతదయగలవాఁడును,నియతిగలవాఁడును,వంచనలేనివాఁడును,నగుపురుషుఁడు యోగ్యుఁ డగుదరునని తెలియవలయును.ఒకమంత్రమున సిద్ధిపొందినవాఁడు వేఱొకమంత్ర ముపదేశింపఁబూన రాదు.మంగలకత్తి చేఁబూనినవాఁడు యుద్ధమునకుఁ బోయెదనన్నట్టు క్షుద్రమంత్రవాది మహామంత్రముల నుపదేశింపఁ యోగ్యుఁడుకాఁడు తా నుపదేశించునది తానే యనుష్ఠింపని వాఁ డయోగ్యుఁడు.అనుష్ఠానము లేనివానికి సిద్ధి లేదు.సిద్ధిలేనివాఁ డితరుల కుపదేశించి నర్హుఁడు గాఁడు.ధనమును సేకరించినవాఁడు గదా దానము చేయ యోగ్యుఁడు జలముతో నిండియుండు కుండగదా దాహము గొన్నవారి దప్పిదీర్చును.ఇట్టి కుండకుఁ జిల్లులవంటివి దుష్టభుక్తి, ధనకామము, స్త్రీకామము ఈ దుర్గుణములు గలవాఁడు దూరమునందే త్యాజ్యుఁడు.కరుణాసముద్రుఁడైన భగవంతునిశక్తి కరుణాదూరులై హింసాదిఘోరకార్యములు ప్రత్యక్షముగనో పరోక్షముగనో చేయువానియందును జేయించువానియందును నుండఁజాలదు.ఇంతయేల ? సముద్రముదాఁటు వాఁడు రంధ్రములలేక దృఢముగనుండు నావయెక్కి పోవువానివలె సంసారసాగము దాటఁగోరువాఁడును దుర్గుణములు దుర్బుద్ధులులేనివానిగను సదుగణములుసద్బుద్ధులు భక్తిశ్రద్ధలుగలవానిఁ గను జూచి గురువుగ గ్రహింపవలెను.అటు చేయనియెడలఁ జెడుటనిజము.మంత్రోపదేశముచేసెద నని ధనము లాగుకొనువానికిని దొంగకు నేమి భేదము? రావణునివంటి సన్న్యాసులు.అర్జునునివంటి సన్న్యాసులు, నీ కాలమునఁ బెక్కురు గలరు.కావున శీలమందు దృష్టి గల స్త్రీలు హెచ్చరిక గలిగి వర్తింపవలయును.జననీ జనక పోషకసమ్మతిని బాలురు బాలికలు, పతిసమ్మతిని ముత్తైదువలు నీసమాజమందుఁ జేరవలయును.శ్రీ రామమంత్రము:- దీని మాహాత్మ్యము శ్రీరామనామమాహాత్మ్యమను గ్రంథమందుఁ గననగు.

జపము:- అనేకజన్మార్జితమైన పాపము మనుష్యునిమనస్సును భగవంతునిపైఁ బోనీయదు.భగవద్విష యమై మనస్సుజేనేఁడు పోయెనేని ప్రారబ్ధము బారెఁడు వెనుకకు లాగును.ఇట్టి పాపము దొలఁగించి మనుష్య లకు బవిత్రులకు జేయునని యజ్ఞము-దానము-తపస్సు అని శ్రీ కృష్ణుఁడు అర్జునున కుపదేశించెను.యజ్ఞమనఁ గా దేవపూజ.అట్టి యజ్ఞములలో జపయజ్ఞము నేను అని కృష్ణుఁడు చెప్పెను గావున మహామంత్రజప మవశ్యము చేయఁదగినది.జపమునకే స్వాధ్యాయమనియుఁ బేరు.భగవత్కథా శ్రవణపఠన మనన భజనాదులు నిందుఁ జేరుచున్నవి.ఇది యెంత యెక్కువచేసిన నంతమేలు.దీనివలననే యిష్టదేవత ప్రత్యక్షమై కోరిక వరమిచ్చును.108 మార్లనునది యధమపక్షము.పదివేలు చేసినను జేయవచ్చును.

18 సంవత్సరములు దాఁటని బ్రాహ్మణేతరులును,మద్యమాంసాదుల నిశ్శేషముగ విడిచి యొక సంవత్స రమైనఁ గాని వారును, నిత్యస్నానము శుచిత్వము యమము లేనివారును జపముచేయరాదు.వీరు పైవిషయము లఁ జక్కఁబడువఱకు శ్రీరామకోటిని విశేషించి వ్రాయవలయును..

ఈ సమాజమునందుఁ జేరిన దినముమొదలు జపము చేయుచుండవలయునని నిర్బంధములేదు.యోగ్యుఁ డగు గురువువలన నుపదేశమునొందిన దినమునుండి చేయుచుండవలయును.ఉపదేశించు నధికారము స్త్రీలకు లేదు.వారివలన నుపదేశమునఁ బొందరాదు.

రామకోటి:- రామమంత్ర ముపదేశమునొంది మూఁడు కోట్లమార్లు జపించినవానికి మరల జన్మము
లేదు. దినమునకుఁ బదవేలు జపించినను నెనుబదినాలుగు సంవత్సరములు పట్టును. ఇది యసాధ్యము కావున
నొకకోటిమార్లు వ్రాసినఁ జాలును. చేతితో వ్రాయుటచేతను వ్రాయునప్పుడు నోటితోఁ బలుకుట చేతను మనస్సుతో
స్మరించుటచేతను నొకకోటి మూఁడుకోట్లగును. ఈవిధముగ వ్రాయువానికిని మరల జన్మములేదు. కావున భక్తి
తప్పక యథాశక్తి వ్రాయవలయును. పలువురుకలిసి యొకకోటి వ్రాయుటవలన ఫలములేదు. భార్యాభర్తలువ్రాయ
వచ్చును. ఇట్లు వ్రాసినదానిని శ్రీ రామార్పణము చేయవలయును. శ్రీరామశ్రీరామయని శుచిగానుండి వ్రాయవల
యును.

జీవహింసచేయరాదు. సర్వము భగవత్స్వరూపమే సర్వమునందు భగవంతుఁడు గలఁడు. సర్వమతని
దివ్యకళామయము కావున భగవద్భక్తిగలిగి భగవత్సేవ చేసెదమనువాఁడు భగవంతుని వాసస్థానములైన జీవుల
నెట్లు బాధింపఁగలఁడు ? దేనిని బాధించినను భగవంతుని బాధించినట్లేకదా యగును. మనకుముల్లు గ్రుచ్చుకొని
న నెంతో బాధపడుదుము. జీవజంతువులగొంతులు కోయునపుడు గొంతులు పిసికినపు డవి యెంత బాధపడును.
ఈ బాధ భగవంతునకుఁ గలిగించినట్లేకదాయగును ప్రయాణముచేయువారికి శకటాది వాహనము లెట్లో
జీవునికి దేహమట్టిది నీవు ప్రయాణముచేయునపుడు దొంగలు వచ్చి నీ వాహనమును హరించుకొనిపోయిన
నీ గతియేమి ?అడవిలో నల్లాడవలయునుగదా. అట్లే హింసింపఁబడిన దేహమందలి జీవి దేహ మకాలమృత్యు
వుచే గ్రహింపఁబడి యాత్రసాగక యుభయలోకములఁ జెడి యెంత తపించునో ! ఆపాపమెవరిది? హింసచేసిన
వానిది. అదియునుగాక మాంసభక్షణము హింస ఘాతక మృగలక్షణము. మృగముల జ్ఞానహీనములు జ్ఞానముగల
వాఁడు మనుష్యుఁడు. ఆ జ్ఞానమును బ్రయోజనపెట్టని మనుష్యునకు మృగమునకు భేదమేమి ?ధనికుఁడయ్యుఁ
గడుపునకుఁ దినని లోభికిని దరిద్రునకు నేమిభేదము ?మనుష్యునకు మనుష్య చర్య యర్హముగాని ఘాతకమృగ
చర్య యర్హము గాదు. హింసరజోగుణతమోగులక్షణము. భక్తుఁడుగాఁగోరువాఁడు సత్త్వగుణము గలవాఁడై యుండ
వలయును. కావున మాంసాహారము తినువారైనను దానిని సాధ్యమైనంత త్వరగా మానవలయును. సారాయము-
కల్లు-అభిని-బంగాకు ఇవి సర్వధా దుష్టములు. సారాయమువంటిదే టీ, కాఫీ, కోకో, నిజమైన భక్తుఁ డాకులు
గిల్లుటకును భయపడును. తన్నెవఁడు నమలునో వానిని నమలెదనని మాంసశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము. నితాంతా
పార భూతదయమును దాపనమందార నాకుదయ సేయఁగదే యని వేఁడుచు హింస మానకున్నచో భగవంతుని
హేళనము చేసినట్లేకదా

పరుల బాధవలన మనల రక్షింపుమని వేఁడుచు పరజీవులను మనము బాధించుటయన నెట్టిది?
అన్ని యమనియములలో నహింస ప్రధానమైనది. అహింసాపరమో ధర్మయని యహింసయేధర్మములందెల్లశ్రేష్ఠ
ము. కావునధర్మములెందెల్ల హింసయో ప్రథమమని యేర్పడుచున్నది. కావున మనోవాక్కాయముల హింస మాన
వలయును. మాంసభక్షణము హింసాత్మకము గావున మాంసభక్షకుఁడు కర్మయోగయుఁ గాఁజాలఁడు భక్తుఁడే
నాఁడును గాఁజాలడు. మాంసభక్షణముచేయుచుఁదాను జ్ఞానియనికాని భక్తుఁడ ననికాని వేదాంతిననికాని చెప్పె
నేని వాఁడు దొంగయనియు మోసగాఁడనియు కుక్షింభరియనియు నమ్మవలయును. అట్టివానిని మహామారిని
జూచినట్టు చూడవలయును. "మేము మాంసము భుజించుట కిష్టపడము. మానుటకు సిద్ధముగా నున్నాము. మా
తండ్రులు చిరకాలముగ మాంసభక్షణమం దభ్యాసపడినవా రగుటచేతను, మాయందలి ప్రీతిచేమేము భుజింపనిది
తాము భుజింపనొల్లకయు మమ్ము మాంసభక్షకులఁజేయ బలవంతపెట్టుదురు. వారిమాట నిరాకరించితిమా
యవినయదోషము గలుగును. వారిమాట నాదరించితిమా నియమభంగముఁ గావించినవా రగుదుము. ఈయొక్క
కారణముచే మే మీ సమాజమందుండ నర్హులముగామా?" యని కొందఱు బాలకులు ప్రశ్నించిరి.

కల్లు-సారాయ-బంగీ-అభినివంటి మత్తుపదార్థము మాంసముగాదు. మెదడును జెఱుచునదిగాదు
అయినను బుద్ధి బలమును దగ్గించును. ధారణచెఱుచును. ఇటువంటి దోషములుగలవు. కింతేనమద్యంవినా
యన్నట్టు మాంసభోజి సారాయము త్రాగకుండుట యరుదు. భూతదయకు దూరమైనది కావున వర్జింపఁదగినది. త
ండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రియన్నట్లు మోక్షకామియై వ్రతములఁబూను కుమారుని నకార్యమునఁ
బ్రేరించి బలాత్కరించి తన దురాచారమునిమిత్తమై బాధించు తండ్రి తండ్రిగాఁడు. తన కన్నకొడుకు బాగు తన
బాగుగఁజూడని తండ్రి యెండ్రిగాక యేటితండ్రి ? ఇది ప్రీతిచేతనేకాదు. వాస్తవమున నెవరి వంశమున భక్తుఁ
డు జనించునోయావంశమున నేడుతరములవారు తరింతురాని శాస్త్రప్రమాణము. ఏనుఁగు దన తలమీఁదఁ
దాను వేసికొన్నట్టు తన తుచ్ఛజిహ్వా చాపలమునకై కొడుకును జెఱిచి యేడుతరముల పితరులను బాగుపడనీ
యనివాఁడు మనుష్యుఁ డనఁదగునా ?ఇట్టి తెలివిమాలిన తల్లిదండ్రులకు జనించిన పుత్రుఁడు శోచనీయుఁడు.
ఇట్టి తండ్రిని నిరసించినను దోషములేదు గాని బాలుఁడు నస్వతంత్రుఁడు జీవికకై తల్లిదండ్రుల నాశ్రయించి
యుండవలసినవాఁడు వారిని నిరాకరించిన లౌకికబాధ పడవలసివచ్చును. కనుక నట్టి తండ్రి తెలివితెచ్చుకొని

సెలవిచ్చువఱకో వాఁడుచచ్చువఱకో యతనిమాట విననట్టు కొంచెముగ గ్రహింపవచ్చును. తినునప్పు డీ యమేధ్య వస్తువు పరుల బలవంతముచేఁ దినుచున్నాను గాని యిష్టము గలిగిగాదు. జిహ్వాచాపలమునను గాదు. ఈ పరే చ్ఛా ప్రారబ్ధమునుండి నన్ను రక్షింపుము. ఈ పాపము నన్ను బలవంతపెట్టువారిదే నాదికాదు. అని భగవంతువేఁ డుచుఁ దినవలయును. ఇట్టి సందర్భములనెల్ల ధర్మవ్యాధునివలె వర్తింపవలయును. కల్లు–సారాయము–బంగి–చుట్టలు–బీడీలు–అభిని–కాఫీ–టీ వీని నన్నిటిని సమాజములోఁ జేరిన దినములనుండి మానవలయును. మాన నేరనివాఁ డీ సమాజమునఁ జేరవలసిన పనిలేదు.

4. జీవనాధారమైన వృత్తియందుఁ బ్రతిఫలాపేక్ష యందవచ్చునుగాని యుపకారమును బ్రతిఫలాపేక్షచేఁ జేయరాదు. ఇదివఱకుఁ దనకొకఁడు చేసిన సాహాయ్యమునకో, యిప్పుడు చేయు సహాయమునకు నిఁక ముందు సాహాయ్యము చేయునను నాశతోనో పరులకు మేలుచేయుటకు యుపకార మనిపించుకొనఁబడదు. బాంధవమెంచి చేయు మేలునకు నుపకారమను పేరురాదు. ఉపకారము చేసి నే నీ యుపకారము చేసితినవి గర్వింపనురాదు. అది యొక గొప్పగాఁ దలంపను రాదు. ఉపకారము చేయకుండుట తప్పుగాని చేయుటయందు మెప్పులేదు.

ధర్మపద్ధతిని:–అధర్మకార్యము చేయుటయం దెవఁడైనఁగాని యెవతెయైనఁగాని యుపకారము చేయుమ నెనేని చేయరాదు.

దుష్కామ క్రోధలోభములకుఁ బాలుపడను:– దొషయుక్తమైన కామము, దోషయుక్తమైన క్రోధము,దోష యుక్తమైన లోభమునని యర్థము. కామ మనఁగా గోరిక. తనభార్యను దాను ఋతుకాలములఁ గామించుట ధర్మకామము తనభార్యను ఋతుకాలములందు నైనను బగటి వేళఁగాని సంధ్యలందుఁగాని నిషిద్ధ దినంబులందుఁ గాని ఋతుకాలముతప్పించికాని రమించుట యధర్మమగును. ఏవస్తువైనను న్యాయ్యరీతి తనదిగాకుండు దానిని గోరుట దుష్కామము. స్వభావవిరుద్ధము, నీతి మతాచార విరుద్ధము,పరులకు హానికరమైనదియు నగు కోరికలు కోరుటయు దుష్కామమే.

అట్లులే క్రోధము, కామము విఘ్నమైనచోఁ గోపము జనించును. కోపము కామవికారమే,కోప మల్పకార ముండును. దీర్ఘకాలముండు కోపము క్రోధమనఁబడును. ఈ కోపముగాని క్రోధముగాని యితరులకు బాధకలిగిం చుటయందుఁ బర్యవసించును. మన కోపమువలన నితరులకుఁ గీడుకలిగెనేని. కీడు కలుగవలయునని యుద్దే శించితిమేని యది దుష్టము.

ఇతరులకు మేలు కలిగించి వారిని జక్కఁబఱుపఁ గోపించితిమేని దుష్టముకాదు. చెడుకార్యము చేయు పిల్లవాండ్రను గోపించి చక్కని నడవడిగల వారుగాఁజేయ దండించుట దుష్టముగాదు. కోపము విషము వంటిది. ఎదుటి వారిని నది బాధించినను బాధింపకున్నను గోప మెవరియందు జనించునో వారిని దొలుతొల్త బాధింపక తీరదు. చెట్టునఁ బుట్టినయగ్ని ముందాచెట్టునే కదా కాల్చును. కామమును జయింప వచ్చునుగాని క్రోధమును జయించుట దుష్కరము. కాముని జయించిన శివుఁడు క్రోధమునకుఁ బాలుపడియెఁగదా. కామము జయించిన విశ్వామిత్రుఁడు రంభపైఁ గోపించెఁగదా. కామక్రోధములు రెండును తన శ్రేయస్సుగోరి వర్తించువానికి మహాఘోర శత్రువులు. అన్నిపాపములకు నీ కామక్రోధములు రెండే కారణములు. కావున వీనికి వశపడకుండఁ దప్పించుకొ నువాఁడే ధన్యుఁడు. తన మేలుకోరు ప్రతిమనుష్యుఁ డీ రెంటిని జయింపఁబ్రబలప్రయత్నములు సర్వకాల సర్వావస్థలఁ జేయుచుండవలయును.

లోభము,ఇదియును గామవికారమే. ఆశయని యర్థము. తన సొత్తు పరులకుఁ బోరాదు. పరులసొత్తు అన్యాయ్యముగ నైనను దనకు రావలయునను కోరిక. ఈ పాపికి ధనార్జనమందు దృష్టియేకాని దానము ధర్మము మొదలైన సద్వ్యయమందు దృష్టిలేదు. వీఁడు తాను దినఁడు. పరుల కననేల పెండ్లాము బిడ్డలకే కడుపు నిండఁ గూడుపెట్టఁడు. కామక్రోధ లోభములు మూఁడును నరకద్వారములని శ్రీకృష్ణభగవానులు సెలవిచ్చిరి.

ఈ సమాజసభ్యులు వీనిని వెంట నే విడువసాధ్యమా ? విడువకుండినఁ బ్రమాణమునకు హానిగదా యని సంశయింపఁబనిలేదు.

ఈమూఁటిని జయించుటయందుఁ జేతనైఁ గృషిచేయుచుండినఁ జాలును. కొందఱ కీ కామక్రోధము లొక జన్మమందైన లోపడవు అట్లని వాని నిమిత్తమై తక్కినవి చాలింపవలయునా ? కావునఁ జేతనైనంత వఱకు వానితోఁ బోరాటము పెట్టుకొని యింటిలోఁ జొరఁబడిన దొంగలను దఱుమఁగొట్ట యత్నము చేయనట్లు వానిని మనదేహమునుండి తఱుమఁగొట్టదృఢప్రయత్నము చేయవలయును.

దేహస్వరాజ్యము సంపాదింప లేనివానికి దేశస్వరాజ్యమేల ? కామక్రోధముల జయించు సాధనములు గలవు. వాని నభ్యసింపఁ గోరువారి కవి నేర్పఁబడును.

5. జాదము మొదలైన గుణములు తక్షణము మానవలయును. ఈగుణములు కలవాఁ డీ సమాజసభ్యుఁ డుగా నుండ యోగ్యుఁడుగాఁడు. ఈ గుణములు కలవాఁ డెవఁడైన నెవతెయైన నీ సమాజమందుఁ జేరఁదలఁ

చెనేని యట్టివారిని జక్కఁగ నెలదినములు పరీక్షించిగాని రామసేవా ప్రచారకుఁడు చేర్చుకొనఁ గూడదు.

6. ఏఱు దాఁటువానికిఁ బడవవలె జీవుఁడు తరించుటకై భగవంతుఁడు శరీరమునిచ్చు దాని రక్షణము నకై యాహార పదార్థము లాయనయే మున్ముందుగా సృజించెను. దేహము ప్రకృతి పరిణామమే. సర్వము భగవంతుఁ డు సృష్టించినదే. ఆయనసొత్తే కావున దేనినైనను నాదియని నాదేహమని తనఁచుట పరుల సొత్తు నపహరించి నట్టి చౌర్యమేయగును. నేను గడతేఱుటకై నీవు నాకీ దేహమునిచ్చి యంతరాత్మవై దానిని భరించునీవు, నీవు సృ ష్టించిన యాహారపదార్థమును నీ యాజ్ఞానుసారము నీ ప్రీతికై యిచ్చుచున్నాను. ఇదంతయుఁ జేయించువాఁడవు నీవే. అను తలంపుతో రామర్పణమని కాని కృష్ణార్పణమని కాని స్వామికి నివేదించి యావల భుజింపవలయును. భుజించునపుడు గోవింద గోవింద యని భగవంతునిపై మనస్సుంచవలెను. ఇట్టులే క్రొత్తవస్త్రములు ధరించు నపుడును ముందు స్వామికి సమర్పించి మరల వానిని నిర్మాల్యముగఁగొని తాను ధరింపవలయును. ఇట్లన్నిటఁ జేయుచుండవానికీ మమకారము తొలఁగును. తామసాహారమును రాజసాహారమును గ్రమక్రమముగ వదలి సాత్త్వికాహారము భుజించుట శ్రేయస్కరము. ఆహారశుద్ధిలేనివానికిఁ జిత్తశుద్ధిలేదు. మనస్సు నిలుకడలేదు. యోగము లేదు. రోగముకలదు.

వ్యర్థభాషణము, భగవంతుని గుఱించికాని, నీతి తామచారముల గుఱించికాని, పెద్దల గుఱించికాని, గృ హకృత్యములందుఁగాని వృత్తియనఁగా జీవనాధార సంబంధ వ్యవహారములందుఁగాని భాషించుట వ్యర్థ భాష ణముగాదు. తనకు సంబంధములేని విషయములు, ఇరుగు పొరుగయ్యలము అమలక్కలయు గుణవర్ణనములు, వీథిరచ్చలు, కలహములు, ప్రొద్దుపోని ముచ్చటలు వ్యర్థభాషణములగును. వీనివలన నాయువువ్యర్థమగుటే ప్రయో జనము, న్యాయమైన యైహికలాభమో, యాముష్మిక లాభమో గోరి మాటలాడుట వ్యర్థభాషణముగాదు.

7. పెద్దవారియందు వినయ విధేయతలు కలిగియుండుట మిక్కిలి ముఖ్యము బాగుపడువానియందుఁ దొలుతఁగనఁబడు చిహ్నము వినయమే. అది వచ్చువఱకు నొకఁడుమంచి మార్గమందున్నాఁడని చెప్ప సాధ్యపడదు. వినయములేనివానికిఁ బరములేదు. సేవకుఁడు వినయముగలవాఁడు కాఁడేని వానియందు స్వామికిఁ బ్రీతిగ లుగునా ?అవినయపరుఁడైన నీవ సేవకుని నీవు ప్రేమింతువా ? బాగుపడు వానియందు వినయమువలెఁ జెడిపోవువానియందు గర్వము ముఖ్యలక్షణము. ఈసమాజమువారు దాసోహమ్మను నది తమ బిరుదుపదముగా నుంచుకొన వలయును. దీనిచే నమస్కరింపవలయును.

8. 108 అధమ పక్షము. ఏంత హెచ్చుగఁజేసినఁనంతమేలు. నిద్రవచ్చువఱకు సీతారామ యనుచుండ వలయును లెక్కింపఁబని లేదు. దేనిని గాఢముగ నాలోచించుచు నిద్రింతుమో యదియే స్వప్నమందును గోచరిం చును. కావున నిద్రించుటకుముందు భగవద్ధ్యానము గావించితిమేని యా విషయమే స్వప్నమందును గోచరించును. ఆ విధముగ నిద్రించుకాలము కూడ భగవద్విషయమందే కడపిన ట్లగును. లేని యెడల నించుమించు సగమా యువు వ్యర్థమగును అది శోచనీయము.

9. శక్తికొలఁది:–ఈ సమాజమం దన్నివయస్సులవారునుందురు గావున నిదమిత్థమ్మని చెప్ప సాధ్యపడదు. రుక్మాంగదచరిత్రచూడుఁడు. తమ తమ శక్తి తామాలోచించి వంచనము లేక వర్తింపవలయును. అందఱును ముఖ్యములైన యేకాదనులఁదప్ప శుష్కోపవాసము చేయవలయునను నిర్బంధములేదు. శక్తిగలవారు చేయవలయు ను. ఏ యాహారము తీసికొనినను బ్రతిదినము తీసికొను నాహారములోఁ బాతికకు మించి తీసికొనఁగూడదు. దేహ సిద్ధి నాలోచించి చేయవలయును. జాగరణము నట్లే. ఎంత మేలుకొనిన నంతమేలు.

అభ్యాసముచే నేదియైన సాధ్యమగును. అభ్యాసము ఓర్పు, పట్టుదల గలవాని కసాధ్యమేదియులేదు. ఏకా దశినాఁడాహారము మితముగనైనఁ దీసికొనువారు సాత్త్వికాహారమునే తీసికొనవలయును.

ఈనియమములు పెద్దపుస్తకమును జదువఁ గోరువారికి ఓనమాలవంటివి. ఈ మాత్రము చక్కఁగ సాధించి నవారుకోరి రేనిపైపై విషయములు యోగ్యతానుసారముగఁ గ్రమక్రమముగఁ దెలుపఁబడును. కనుక నియమముల నుపేక్షింపరాదు.

చెఱువునకుఁ గట్ట యెట్టిదో బాగుపడు వానికి నియమమట్టిది. నియమహీనుఁడు కడఁదేఱఁజాలఁడు.

యావజ్జీవము:– విత్తనము నాఁటగానే ఫలములు నోరికిరావు. మడిలో ధాన్యము చల్లగానే యాకులోని కన్నమురాదు. దున్నక విత్తినఁ గోయకపండును. కావున నియమములచేదేహమును మనస్సును బాగుపఱిచి కొని భక్తిబీజమునాటియది మొలకెత్తఁగానే పశువులు మేయకుండఁ జుట్టు కల్లనాటి నీళ్లు పోసి పెంచినఁ గాలంతరమున నది యెట్లు ఫలించునో యట్లు యజ్ఞ దాన తపములచే దేహము మనస్సు శుద్ధిపఱిచికొని భక్తి బీజమునాటి శుష్క వేదాంతులు మాయజోగులను పశువులు మేయకుండ నియమములచేఁ గాపాడి యది వ్రాలిపడకుండ నభ్యాసమను నాఁవుపెట్టి భక్తిజ్ఞాన వైరాగ్యములను నీళ్లుపోసి పెద్ద చేసితిమేని మోక్షఫలము తప్పక యిచ్చును. ఏమఱియుంటిమేని పశువులయిన మేయును. కట్టెలకై యెవరైన గొట్టుకొని పోయెదరు కావునఁ

గోరిక లభించువఱకు నభ్యాసము మానరాదు. ముక్తికాంతకు మనయందుఁ బ్రీతివిశ్వాస స్నేహములు కలుగ నమ్మఁజెప్పుటకు నామె నర్మసఖియగుభక్తి కన్యకు సాధ్యపడునట్టు నపుంసక జ్ఞానమునకుఁ జిత్తవృత్తిరహితయోగ పురుషునకు సాధ్యపడదు స్త్రీలు చెలికత్తెలయందుంచు విశ్వాసము నంతఃపురమునఁ గావలియుండు షండులయం దును ద్వారపాలక పురుషులయందు నుంతురా ? ముక్తియు భక్తియు వేఱు వేఱు స్త్రీలుగారు. ఇప్పుడు మీరాశ్రయిం చిన పెంచుభక్తి కన్యాశిశువువే యుక్తవయస్సు వచ్చినపుడు చూచితిరేని ముక్తికాంతగఁ గానవచ్చును. భక్తియేముక్తి ముక్తియేభక్తిదశాభేదము వలన నామభేదము, లేఁతగానున్నప్పుడు పిందెయందుము పక్వదశయందుఁ బండందు ము. పిన్నవయస్సు బాలుఁడే పెద్దవయస్సున వృద్ధుఁడు. కావున ముక్తికై భక్తినాశ్రయించువా రెవరదిదయనో సంపాదించుటకు మఱియెవఱినో యాశ్రయించుచున్నామని తలఁపరాదు. ముక్తియను తరుణికై ముక్తికన్యనే యాశ్రయించు చున్నామని తలఁపవలయును, ఉపాయము ఫలము భేదముగఁ దలఁచువారు జ్ఞానులు,యోగులు శాస్త్రపద్ధతి జ్ఞానులు యోగులునైన వారిస్థితి యట్లుండఁ దిష్టస్మాత్రుల నప్రక్షాళితమలుల శిశ్నోదర పరాయణుల ధర్మకంచుకుల లోకవంచకుల నేమని చెప్పవలయును ?ఇట్టివారు నింద్యులు గాని నిజమైన జ్ఞానులు యోగులు గారు. ఈ గ్రుడ్డివారి వెంటఁబోవు గ్రుడ్డివారి గతియేమి ? ఏ గుంతులోనో కూలవలసిన వారేకదా. కావున మతి మంతులకు భక్తి యొక్కటేగతి.

ఈ సమాజమందుఁ జేరక రామకృష్ణ యనిన మాకుమోక్షము రాదాయని కొంద ఱనవచ్చును. రాదని యెవఁడు చెప్పును ?అభ్యాస దశయందుండి యుత్తరోత్తరాభి వృద్ధికివలయుసుకరములగు మార్గము లీ సమాజ మువారికిఁ దెలుపఁబడును. ఇందుఁ జేరనివారి నడవడులు చిత్తవృత్తులు నభ్యాసములు తెలిసికొన సాధ్యముగాదు కావున వారికి రహస్యవిషయములు తెలుప సాధ్యపడదు.

ఈ సమాజములోఁ జేరిన వా రెవరితోను భగవద్విషయమైనభక్తివిషయమై వాదింపవలసిన పనిలేదు. అది శాస్త్రవిరుద్ధచర్య. మన నియమములను మనము పాటించుట విధి శ్రీకృష్ణావతారతత్త్వము,హనుమదా చార్యోపదే శము,భక్తిసంజీవని మొదలగు భక్తిగ్రంథములఁ జదివినవారీ సమాజము వారిని నాక్షేపింప సాహసింపరు, భక్తిసంజీవని సిద్ధకమగుచున్నది. వారంపరాని కారణములచే రోగాది బాధలచే నియమములఁ గొంత విఘ్నము కలిగినను భయములేదు. అనితీరిన తరువాత మరలఁబూర్ణముగ నాచరింపవలయును. ఉపేక్షయు సోమరితనము నశ్రద్ధయుఁ గారాదు.

ఈ సమాజాధ్యక్షు చరితము హనుమదాచార్యోపదేశమనుగ్రంథమునఁ గన నగు.

ఈ సమాజసభ్యులు తాము సేవకులమని యెంచవలయునేకాని భక్తులమని గర్వింపరాదు. కావుననే వినయ మొకనియమముగ విధింపఁబడినది. నిజమైన భక్తిగలవానికిఁ దానుభక్తుఁడనను నభిప్రాయము గలుగనే కలుగదు. కలిగెనావాఁడు భక్తుఁడుగాఁడు. సేవకులచిహ్న యంజలి. ఈ సమాజాధ్యక్షుఁడెప్పుడు నంజలిమోడ్చియే యుండును. హనుమంతుఁడు లంకలో 'దాసోహం కోసలేంద్రస్య' యని చెప్పెను రాజకుమారుఁడు లక్ష్మణుఁడు "అహందాస్య ముపాగత" యని చెప్పుట యవమానముగఁ దలఁచినవాఁడు కాఁడు. విశిష్టాద్వైత స్థాపనాచార్యు లైన శ్రీభాష్య కార్యులంజలి వహించియే యుందురు. శ్రీకృష్ణుఁ దుద్ధవునకుఁ గడపటఁబ్రణమే దీశ్వరకలా మాశ్వచండాల గోఖరమ్మని యుపదేశించెను. ఉద్దేశము నీచమైన సేవయు నీచమే. నీచసేవ నీచము. ప్రతి ఫలా పేక్షలేక యుపకారబుద్ధితోఁ జేయు సేవ నీచ మేనాఁడును గాదు.

నారాయణునకు లక్ష్మీదేవి చేయునది సేవయే, హనుమంతుఁడు శ్రీరామునకుఁ జేసినది సేవయే. శబరీ నారదాదులు చేసినది సేవయే కావున గురుబుద్ధితోఁజేయు సేవ యత్యంత శ్లాఘ్యము. కావుననే ప్రధానస్థాపనమునకు రామ సేవాకుటీరమనియు, సమాజమునకు సేవక సమాజమనియు నామధేయంబు లిడఁబడియె.

ఈ యభిప్రాయము లేనివారును,డాంభికులును,గర్విష్ఠులును,జ్ఞానులమని యోగులమని తమ్ముఁదాము గొప్పవారమని దలఁచుకొను వారును నీ సమాజమందుఁ జేరరాదు.

వినయమున కొక యుదాహరణము. కవితార్కికసింహులనియు, వేదాంత దేశికులనియు బిరుదులువహిం చి యనేక గ్రంథముల రచించి కీర్తిగాంచిన వేంకటాచార్యు లనువారు విరక్తిచే భిక్షించి జీవించుచుండిరి. విద్యా మత వాదములందు వీరికి నోడిపోయిన కొందఱు బ్రాహ్మణులు వీరిని నవమానపఱుపఁ దలఁచి యొక యింటివాకిటఁ దల దగులునట్లు ముచ్చెలతోరణమును గట్టిరి. ఆయన భిక్షకై యా యింటిలోనికి పోవయత్నింపఁ దన తన కా ముచ్చెలు దగులునట్లుండెను. దాని భావంబు గ్రహించి.

శ్లో. కర్మావలంబినః కేచిత్, కేచిత్ జ్ఞానావలంబినః
వయంతు వైష్ణవానాంచ, పాదరక్షావలంబినః

కొందఱు కర్మయోగావలంబులు కొందఱుజ్ఞానయోగావలంబులు మేము విష్ణుభక్తుల పాదరక్షలఁ దలఁదా ల్చువారము అని చెప్పి యవి తల దగులుచుండ లోపలికిఁ దూఱిరి. ఆ యింటివారే సిగ్గుపడి యావల నాయనను గౌరవించిరి. వినయ మిట్టిదై యుండవలయును. తన్నెంత పరిభవించిన సహింపవలయును గాని తన వినయముప లనఁ దన మతమునకోదేశ దేవగురు జననీజనక స్త్రీలకో హాని యవమానము నిష్కారణముగఁ గలుగున ట్లుం డెనేని వినయము వహింపఁ బనిలేదు. తన కన్నులయెదుటఁ దమ స్త్రీలనో పరస్త్రీలనో దుష్టులు దోఁచుటగాని పరిభవ పఱుచుటగాని తటస్థించెనేని యప్పుడు వినయమువహింపరాదు. ప్రాణమిచ్చియైనగుత్తిహంసన్నవలెవారి ని రక్షింపవలయును. ఇది కోదండరామసేవక సమాజము. శ్రీరాముఁడు కోదండముపట్టినది ధర్మరక్షకు-నధర్మశిక్ష కుఁగావునఁ దమకన్నులయెదుట నధర్మకార్యములు జరుగుచుండ నీ సమాజమువారు ధర్మరీతి యథాశక్తి ప్రతిక్రియ చేయవచ్చును. కావలయునని కలహమునకుఁ బోరాదు. తన యవమానమును సహింపవలయును. దీని వలన నింద్రియ జయము గలుగును. శక్తి లేనివాఁడు వినయవంతుఁడై యుండక విధిలేదు. వీని వినయమునకుఁ గారణము పిఱికితనము,పిఱికితనమపు వినయము శ్లాఘ్యముగాదు. దాసోహం భావముగల హనుమంతుఁడు స్వామికార్యమున నెట్లు వర్తించెనో యెఱుఁగమా? రోగాది బాధలు బాల్యవార్ధకములు పీడించుచుండినఁ దప్ప దేహబలము మనోబలముగల స్త్రీ పురుషులే శ్లాఘ్యులు. ఇట్టివారే యోగార్హులు ప్రతిక్రియ చేయ విధిలేక వచ్చిన పుడు, నట్లు చేయకుండిన సత్యము ధర్మము చెడునని తోఁచినపుడు మాత్రమే యాత్మాత్మీయ రక్షణకై యెంత యావశ్యకమో యంతమాత్రము ప్రతిక్రియ చేయవలయునుగాని తక్కిన వేళలఁ గాదు.

ఎంతరహస్యముగఁ జేసినను తాము చేయు కార్యములను, దాము తలఁచు తలఁపులను నంతర్యామియై తన హృదయములనుండు నీశ్వరుఁడు చూచుచున్నాఁడనియు, సంబంధము తమకు నాయీశ్వరునకే కాని యితరుల కెవ్వరికిఁ గాదనియుఁ, గార్యములు చిత్తశుద్ధి భక్తిగలిగి చేయుట తమవంతుఫలమనుగ్రహించుట నాయన వంతనియుఁ, దాము భగవంతు వంచింపఁ దలఁచినఁ దమ్ము భగవంతుఁడు ఫలమిచ్చుటయందు వంచించుననియుఁ గావున నియమములను వంచనలేక యాచరింపవలయుననియు సమాజ సర్వదా జ్ఞప్తి యందుంచుకొనవలయును.

ఈ సమాజసభ్యులు సమాజమునఁ జేరినపిమ్మట సాధ్యమైనంత త్వరలో నవకాశము కలిగించుకొని దినమున కొకసారి సుందరకాండమంతయుఁ బారాయణము చేయుట శ్రేయస్కరము. ఇట్లేడుదినములు చేసి యేడవదినమున 24 గురికి నన్నదానము చేయవలయును. ఇట్లు చేయుటకు గం. 5-10నిమిషములు పట్టును. కామ్యార్థులు భోజనపూర్వమును-మోక్షార్థులు భోజనపూర్వమును అనంతరమును జేయవచ్చును. సంస్కృతమునఁ జదువలేనివారు నర్థము చేసికొనలేనివారు నాంధ్రవాల్మీకిరామాయణమందలి సుందరకాండమును జదువవచ్చు ను. చదువలేనివారు చదివించి వినవచ్చును. ఇట్లు చేసి బాగుపడిన వారు కలరు. కావునఁ జెప్పవలసివచ్చెను. పై విధముగఁ జేయలేనివారు దినమున కేడు సర్గములవంతునఁ జదువవచ్చును. రామానుగ్రహమునకుముందు సీతాహనుమంతుల యనుగ్రహము సంపాదింపవలయును. హనుమదాచార్యోపదేశముఁ జూడుఁడు

బాలుఁడైనధ్రువునకు భగవంతుఁడైశ్వర్యముమోక్షముననుగ్రహించెను.

రాక్షసబాలుఁడైన ప్రహ్లాదునకు నైశ్వర్యమోక్షములు శ్రీనృసింహమూర్తి యనుగ్రహించెను.

శ్రీరామునకు బాల్యమిత్రుఁడు బోయవాఁడు గుహుఁడు.

శ్రీకృష్ణునకు బాల్యస్నేహితులు గొల్లవాండ్రు.

శ్రీకృష్ణమధురాపురమునఁ దొలుతనాదరించిన భక్తుఁడు సాలెవాఁడు.

శ్రీరామానుజచార్యులవారు పంచముల నాదరించిరి.

ఆళ్వారులలో నొకరు పంచముఁడు తిన్నఁడు బోయ, నందనార్ పంచముఁడు.

గోపికలు-ద్రౌపది-బ్రాహ్మణ భార్యలు- శబరి లోనగు వారు స్త్రీలు.

శ్రీరాముఁడు మోక్షమిచ్చిన జటాయువు గ్రద్ద.

హనుమంతుఁడు వానరుఁడు

గజేంద్రుఁడు పశువు.

కావున భక్తికి వయస్సు-కులము జ్ఞానము యోగముశక్తి సామర్థ్యములు ప్రధానములుగావు. ప్రేమ యొక్కటే ప్రధానము భక్తి యెప్పుడు పండియుండు చెట్టు గొడ్డుపోదు. ఎంతచేసిన వారి కంతఫలము తప్పదు. క్రమ క్రమాభి వృద్ధిగాంచును. భక్తి ప్రపత్తులఁదప్ప భగవదనుభవానంద ముక్తిలేదు.

ఇంతకుఁ బూర్వమే నరసింహకృష్ణాది మంత్రములను గాని షడక్ష రాష్టాక్షర ద్వాదశాక్షరాది మంత్రములఁ గాని మహామంత్రము నేదియైనఁగాని యుపదేశమునొంది జపించు వారు దానిని విడువరాదు. దానికిఁ దోడు రామమంత్రమును జపింపవచ్చును. అట్లు జపించినను జపింపకున్నను రామకోటి వ్రాయుచుండవలయును. తక్కిన

నియమములను బాటింపవలయును. మతత్రయములో నే మతమువారైనను నే జాతివారైనను శ్రీరామునకు విముఖులు గారేని శ్రద్ధాభక్తులు గలవారేమి ముముక్షులేని యీ సమాజమునఁ జేరవచ్చును. భక్తిని నిరాకరించు మతమేలేదు. అటులుండిన నది దుర్మతమే.

ఈ సమాజమువారుభక్తినే ముఖ్యముగ నెంచవలయును. హఠయోగము వ్యర్థము. జ్ఞానము యోగము భక్తికంగములుగ నభ్యసింపవచ్చును. వాని నభ్యసింప శక్తి యనుకూలత లేనివారు "దంతియూథపు చందంబున భక్తి సేయవలయు" నన్నట్లు భక్తిమాత్రమే సాధింపవచ్చును. ఉపనదుఉల కలియకున్న గంగానది యెండి సముద్రముఁ జేరకపోదు. అట్లే భక్తియు సంగములయిన జ్ఞానయోగములు లేకున్నను జెడదు. భక్తికిసంగములుగ జ్ఞానమును యోగమును నభ్యసింపఁ గోరువారు పరులసాహాయ్య మఖిలషింపఁ బనిలేదు. యోగ్యతగలవారికిదే నేర్పఁబడును.

ఈ సమాజమువారు తమ మిత్రులు శుష్కవేదాంతులయు మాయాయోగులయు వలలలోఁ బడకుండ బోధించి రక్షింపవలయును.

ఆత్మసాక్షాత్కారములేక యద్వైతసిద్ధిఁ బొందక అహంబ్రహ్మాస్మియనువారును, గర్మములందునద్వైతమను ష్ఠించెదమనువారును, సాధనచతుష్టము సంపత్తిలేక జ్ఞానులమనువారును, మద్యమాంసాదులను గంజాయి యభిని యుపయోగించువారును, జితేంద్రియులు గానివారును, గామినీకాంచనా సక్తులును, శ్రద్ధాభక్తి శూన్యులును, దాన ధర్మములు విగ్రహారాధనము ననావశ్యక మనువారును, వైరాగ్యము లేనివారును, విషయాసక్తులును, నియమహీను లును, దురాచారులును, శాస్త్రవాక్యములను విపరీతార్థము చెప్పువారును, గురూచ్ఛిష్టమని తమ నోటి యెంగిలి తీసిపెట్టువారును, ముత్తైదువులకు సంసారము పతిసాంగత్యము పనిలేదనువారును, స్త్రీలకు శీలము చెడబోధించు వారును, వారి శీలముఁ జెఱుప యత్నించువారును, బరస్త్రీలచే నంగశూశ్రూష చేయించుకొనువారును, దేహధారణ మునకుఁగాక దేహపోషణమునకుఁగా భుజించువారును శుష్కవేదాంతులని యెఱుంగవలయు. వీరి ముఖములు చూచుటకైన స్త్రీలు పోరాదు. పురుషులు పలుకరింపరాదు.

యమనియమము లనుష్ఠింపనివారును, నొక్క యాసనమందైన నైదు గంటలయిన నుండలేనివారును, సమ శ్వాసము లేనివారును, బ్రాణాయామము సాధింపనివారును, రాజసతామసాహారములను దీసికొనువారను, గడుపు నిండఁ దీనువారుఁను, ఱొమ్ముకంటెఁ బొట్టముందుగ వచ్చినవారును, బద్ధపద్మాసనము వేయలేనివారును, శుష్కిం పని దేహముగలవారును, మహాత్మ్యమును గనఁబఱిచెద మనువారును, మద్యమాంసాదులు గంజాయి అభిని గ్రహించువారును, బరస్త్రీ దనకాంక్ష గలవారును, రాత్రులందు 4 గంటల కెక్కువ నిద్రించువారును, దేవునిఁ జూపెదమనువారును, నిట్టివారు యోగులమని రేని దొంగయోగులని నమ్మవలయును. భక్తులమని సన్యాసులమని లోకులను వేషభాషలచే వంచించువారును గలరు. ఇట్టివారిని నీ సమాజమువారు గురువులుగ గ్రహింపరాదు. వారి స్నేహమును జేయరాదు. అటని వారితోఁ గలహింపనురాదు. వంచనము వాదము కలహ మీ సమాజము వారికిఁ దగిన కార్యములు కావు. ప్రతి సభ్యుఁడును సభ్యురాలును రామస్మరణ చిహ్నమును ధరించి దాని నప్పుడప్పుడు చూచుచు నుపదేశింపఁబడిన రీతిని రామస్మరణము చేయుచుండ వలయును. ఇది చాలముఖ్యము. ఇది ధరింపనివారు సభ్యులుగా నెన్నఁబడరు. ఇంతకెక్కువ యభ్యసింపఁగోరువారు ద్వితీయసోపానమును జదువ వలయును.

భక్త నిత్యచర్య ప్రథమసోపానము.

-----------

సర్వార్థ ప్రదాయిని భక్తియే
సర్వానర్థ ప్రణాశిని భక్తియే
సర్వాధి నివారిణి భక్తియే
సర్వావ్యాధి నివారిణి భక్తియే
ఐహిక సుఖదాయిని భక్తియే
ఆముష్మిక భోగదాయిని భక్తియే
సర్వయోగాతి శాయిని భక్తియే
సర్వభోగాతి శాయిని భక్తియే
సర్వయోగాధర భక్తియే
సర్వభోగాధార భక్తియే
సుఖమార్గ సంచారిణి భక్తియే
అంజలి ముద్రాధారిణి భక్తియే

స్వాశ్రిత గుణాభిజ్ఞ భక్తియే
స్వాశ్రిత గుణానభిజ్ఞ భక్తియే
స్వాశ్రిత నిరపాయిని భక్తియే
నిశ్చయ శీఘ్రఫలదాయిని భక్తియే
ముక్తికన్యా స్వరూపిణి భక్తియే
ముక్తితరుణీ స్వరూపిణి భక్తియే
ముక్తియే భక్తి
భక్తియే ముక్తి
శ్రీ రామార్పణమస్తు.

=========

శ్రీ రా మ సే వ.

# శ్రీ కో దం డ రా మ సే వ క స మా జ ము.

## భ క్త  ని త్య చ ర్య.

## ద్వితీయసోపానము.
=======

భక్తిశాఖాధ్యక్షుడు :
శ్రీరామదాస సంజీవరాయఁడు, ఒంటిమిట్ట.



కార్యనిర్వాహకుఁడు :
వాసుదాసుఁడు, వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట.

ప్రధానస్థానము :
శ్రీరామసేవాకుటీరము, ఒంటిమిట్ట.

ప్ర కా శ కు లు.

శ్రీ కో దం డ రా మ భ క్త సే వా స మి తి
శ్రీరామసేవాకుటీరము
ఒంటిమిట్ట, కడపజిల్లా.

శ్రీ రా మ సే వ.

## శ్రీ కో ద ం డ రా మ సే వ క స మా జ ము.

## భ క్త ని త్య చ ర్య.

## ద్వితీయసోపానము.

=======

సోదరులారా ! సోదరీరత్నములారా !

"సంసార తాపత్రయ బాధపడలేక కారు చిచ్చునందుఁ దగులుకొనిన మిడుతలవలెఁ బరితపించు మేము దీనినుండి తప్పించుకొను టెట్టులా యని నిర్వేదపడుచుండి శ్రీకోదండరామసేవక సమాజ పక్షమునఁ బ్రకటింపఁబడిన పత్రికఁ జూచి సభ్యులమై ప్రార్థనా పత్రమందు మేము ప్రమాణము చేసిన చొప్పున నడుచుకొను చున్నాము. అందుఁ జెప్పిన కార్యము లల్పకాలములో ముగియుచున్నవి. తక్కిన దినమంతయు నేమి చేయవలయు ను?ఆ మాత్రము చేసినఁ జాలునా" యని మీలో గొందఱు ప్రశ్నించిరి. చాల సంతోషపడితిని. దీని వలన మీ శ్రద్ధము భక్తియు నాసక్తియుఁ దెలియవచ్చిడివి. ఈ సమాజ కార్య నిర్వహణ భారము భగవంతుఁడు వీనిపై వేయుటచేతను వీనియందు జ్యేష్ఠ భ్రాతృ గౌరవముంచి మీరు ప్రశ్నించుటచేతను బాగుపడఁ గోరువారిని బాగు పఱుచుట వీనికి విధిగావునను మీకుఁ దెలియనివి నాకుఁ దెలిసినవి నేను జెప్పుట కర్తవ్యము గావునను మీ ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరమిచ్చెదను.

మన సమాజమందు నన్నివర్ణములవారును గలరు. సమష్టిమీఁద నందఱకు నన్వయించు విషయములే చెప్పెదను. నేను జెప్పునని యేమతమువారును నిరాకరించునవికావు. అన్నిటికిని నిందుఁ జెప్పఁబడునవి ప్రాణము లవంటివి కావున నాయామతముల వారు వారివారి సంప్రదాయములప్రకారము వర్తించుచు నిందుఁ జెప్పినవిధ మునను వర్తింపవచ్చును. సంసారులుగా నుండి కడదేఱు మార్గమే యిప్పుడు చెప్పంబూనితిని. ఈ మార్గము సాధించి సంసారము రోసి యింత కెక్కువ యెఱుంగఁ గోరువారికి వారికిఁ దగిన మార్గమావలఁ జెప్పుదును. కావున నిప్పుడు నేను జెప్పునది సావధానముగా విని యాప్రకారము నడుచుకొన వేఁ డెదను.

అన్నలారా ! యక్కలారా ! ! భక్తిభక్తి యనినంతమాత్రముననే ముక్తిరాదు భుక్తి భుక్తి యనినంత మాత్రముననే యాఁకలి శమింపదు. యావజ్జీవము దేహపోషణమునకై యెట్లాహారము తినెదమో యట్లే యాత్మ పోషణమునకై భక్తి చేయవలయును. దేహము ప్రాకృతి పదార్థముగావునఁబ్రాకృతిపదార్థములచే దానిని బోషించు చున్నాము. ఆత్మవస్తువును నాత్మవస్తువు చేతనే పోషింప వలయును. భగవచ్చింతనమే యాత్మకుఁ బోషకము. ఆహా రములేని దేహమెట్లు చెడునో భగవచ్చింతనము లేని జీవుఁడు నట్లు చెప్పెను. ఆత్మను హింసింపరాదు. ప్రీతితోఁ దిను నాహారమే దేహధారకము. ప్రీతితోఁ జేయు చింతనమే యాత్మ ధారకము. కావున మనమెంత ప్రీతితో దేహమును బోషించుచున్నామో యంత ప్రీతితో నాత్మను బోషింపవలయును

పరమభక్తి లభించినఁగాని ముక్తిలేదు. స్నేహపూర్వకమైన ధ్యానమునకు భక్తియనిపేరు క్షణోపితే యిద్వి రహోూతి దుస్సహ యన్నట్లోక క్షణమైన భగవన్నామ చింతనము లేకుండినఁ బ్రాణము పోవునంతటి స్థితి యెప్పుడువచ్చునో యప్పుడు పరమభక్తి లభించునదని యెంచవలయును. ఇట్టి భక్తి భక్తులు వ్యవసాయముకొలఁది దైవానుగ్రహమువలన నీ జన్మమందే లభింపవచ్చును. ప్రారబ్ధ మడ్డుపడునేని మఱు జన్మమందు లభించును. ఇది యధికారి యధికారముకొలఁది దైవానుగ్రహము కొలఁది యుండును. విచారసాగరహల్లోహలులకు రామసేవా మతము ధూమనావిక.

"తీవ్రసంవేగానామాసన్నః" పతంజలి 1 అధ్యాయము 21 సూ

మృదుమధ్యాతిమాత్రత్వాత్తతోపివిశేషః.................22 సూ

ఈ విధముగఁ బతంజలి తన యోగశాస్త్రమందు నధికారుల విభజించి యున్నాఁడు. ఈ సూత్ర ముల వలన నెవని భక్తి యత్యంత తీవ్రము నేకాంతమునై యుండునో వానికి ముక్తి యాసన్నమై యున్నది. అనఁగా నాదేహాంతమందే ముక్తియని యర్థము. ఇందు మృదువు,మధ్యమము ,అతిమాత్రమని మూఁడు భేదములు. దీనిచేఁ దొమ్మిది విధముల యధికారము లేర్పడెను. అవి యెవ్వియనిన :-

మృదువు:-మృదువులో మృదుసంవేగము.

మృదువులో మధ్యమసంవేగము.

మృదువులో నతిమాత్రసంవేగము.

మధ్యమము :–మధ్యమములో మృదుసంవేగము.
మధ్యమములో మధ్యమసంవేగము
మధ్యమములో నతిమాత్రసంవేగము.
అతిమాత్రము:–అతిమాత్రములో మృదుసంవేగము.
అతిమాత్రములో మధ్యమసంవేగము.
అతిమాత్రములో నతిమాత్రసంవేగము.

ఇందు నేడవది పరభక్తి, ఎనిమిదవది పరజ్ఞానము తొమ్మిదవది పరమభక్తి. ఈ తొమ్మిదవ వాఁడే నిజమైనజ్ఞాని వీఁడే పరమైకాంతి.వీనికి జీవితదశయందును భగవంతునితోడి వియోగములేదు.

ఎనిమిదవవాఁడు పరజ్ఞాని,వీనికి భగవత్సాక్షాత్కారము గలదుగాని యిది నిరంతర ముందునది గాదు.మెఱఁగు యెఱసినట్లు వచ్చుచుఁ బోవుచుండును.ఏడవవానికి నాత్మసాక్షాత్కారము గలదు .భగవత్సాక్షాత్కారము లేదు.

భక్తుఁడు నిరంతర భగవత్సాన్నిధ్యముననఁగాని సంతుష్టిగాననఁడు.కావున నెనిమిదవ తొమ్మిదవదశకుఁబోవఁ గోరును.ఏడవదశకు వచ్చువఱకు భక్తికలిగినదని చెప్పరాదు.అంతవఱకు సాధనభక్తుఁడేకాని ప్రేమభక్తుఁడుగాఁడు.ప్రార్థనాపత్రములందుండు ప్రకారము–చేయువారు. మొదటిరకమువారేకాని యంతకెక్కువ వారుగారు.వీరు ప్రథమసోపానమందుండువారు.ఆఱవదశకువచ్చు మార్గమువఱకు మీ కిప్పుడు చెప్పెదను.ఇది ద్వితీయసోపానము అంతవఱకు తృతీయసోపానమందుఁ దెలుపఁబడును.మార్గమును జూపుట నావంతుగాని మార్గమున నడవవలసినవారు మీరే.నేను భుజించిన మీ యాఁకలి తీరునా ? మీరు మందుదినిన నా వ్యాధి మానునా ?రోగమునకుఁదగిన మందుదిని పథ్యముండిననఁగాని రోగము శమించునా ?కావున మనకుఁ గోట్లకొలఁది జన్మములనుండి వెంటనంటివచ్చు జననమరణమను నీ పురాణరోగము తగిన యౌషధమును సేవించి పథ్యముండిననఁగాని పోవునా ? కావున నా యౌషధ మేభక్తి.వైరాగ్యము పథ్యము. ఔషధమును సేవించు విధమును దెలిపెదను.

భక్తి కామధేనువు.వైరాగ్యము పచ్చికసవు.శ్రద్ధయను నది దూడ.భగవంతుఁడు పాలు పిండి మనకిచ్చు గోపాల కృష్ణుఁడు ముక్తి పాలు.

భక్తి కామధేనువు కావున నెవ్వ రేదిగోరిక నది యిచ్చును.ఐహిక సుఖములఁ గోరినవారికినైహికసుఖముల నిచ్చును.ఆముష్మిక సుఖముగోరువారికి దానినే యిచ్చును.ఆముష్మిక వాంఛగలవారు తుచ్ఛములైనయైహిక సుఖములఁ గోరరాదు.కోరిరేని చెడుదురు.ఒక యాచకుఁ డొక గృహస్థునింటికిఁ బోయి వివాహార్థినై వచ్చితిని సాహాయ్యము చేయవలసినదని కోరెను.ఆ గృహస్థుఁ డతిథులయందుఁ బ్రీతిగలవాఁడు కావున భోజనమునకుఁదన యింటనే నిలుపుమని యా యాచకుని గోరెను.భోజనానంతరము,తాంబూలము వేసికొను సమయంబున గృహస్థుఁడు బుఱ్ఱలోనుండి నస్యము తన చేతిలో వేసికొనుచుండెను.ఆ దురభ్యాసమే కలిగిన యా యాచకుఁడు "నస్యదానం మహాదాన, మన్నదానంతు మధ్యమంకన్యాదానం వృథావృథా" యని చదివి చేయిచాఁచెను.

ఆ గృహస్థు తన చేతిలోని నస్యము వాని చేతిలోవేసియొక రూపాయి నస్యముదెప్పించి యాచకునకిచ్చి యిఁక బొమ్మనెను.

కాఁబట్టి దేవునిని నాకు బిడ్డలిమ్ము.నాకు సొమ్ములిమ్మని కోరువారిగతి యంతే.

శ్లో . అన్నం పానం ధనం వస్త్ర, మాయురారోగ్యమాస్పదమ్
ఆపద్యసి నయాచేత, పూజకః పురుషోత్తమమ్
తత్పాదభక్తిజ్ఞానాభ్యాం, ఫలమన్య త్కదాచన
నయాచేత్ప్రణతో విష్ణుం, యాచనా న్నశ్యతి ధ్రువమ్.

భగవంతుఁడైన విష్ణువును భక్తిజ్ఞానమునలకు దప్పముముక్షువు మఱిదేవిని గోరరాదు.అవిగాక యన్నము పానము ధనము వస్త్రము ఆయువు ఆరోగ్యము ఇల్లు భూమిలోనైనవి కోరరాదు.కోరెనా మోక్షాసక్తిగలవాఁడు చెడుట సత్యమని యర్థము.

కోరు కోరువారు భక్తులుగారా యనిన వీరును భక్తులే.ఉదారాస్సర్వ ఏవై తే యనికదా శ్రీకృష్ణమూర్తి సెలవిచ్చెను.ఆర్తుఁడు జిజ్ఞాసువు అర్థార్థా జ్ఞాని యను నలువురు నాభక్తులే.ఇందు జ్ఞాని నా యాత్మయే యని చెప్పుటచే నీ నలుగురిలోఁ బ్రతి ఫలాపేక్షలేక భగవత్కైంకర్యమే పరమప్రయోజనముగాఁ గలిగి భగవంతుని వియోగమును బాయలేని జ్ఞాని శ్రేష్ఠుఁడని యేర్పడుచున్నది.కావున మనమిట్టి జ్ఞానులమై భగవంతుని వారమె భగవంతుఁడు మనలను"వీరు నాస్వజను"లని తలఁచునట్లు మనము ప్రవర్తింపవలయును.

"స్నేహపూర్వ మనుధ్యానం భక్తిరిత్యభిధీయతే" ప్రీతిపూర్వకమైన ధ్యానమునకు భక్తియనిపేరు.దేనిని బలుమాఱు మను ధ్యానింతుమో దానియం దాసక్తి కలుగుట నైజము.ఆ శక్తి కలిగినవస్తువును సంపాదింపయత్నిం

చుటయు సిద్ధము.కావున నిరంతరము భగవంతుని ధ్యానించుటచేభక్తిజనించును.భక్తివలన భగవత్సాయుజ్యరూప ముక్తి గలుగును.

"ఏనకేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్"

ఏ యుపాయముచేనైనను మనస్సును భగంతునియందుంచవలయును.ఇట్లు మనస్సును బుద్ధిని భగవంతునియందుంచిననే భగవత్ప్రాప్తిగలదు.

శ్లో. మయ్యేవ మన ఆధత్స్వ,మయిబుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ,అత ఊర్ధ్వం నసంశయ,
యనియే శ్రీకృష్ణభగవానులు సెలవిచ్చిరి.

ఈ భక్తి తైలధారావదవిచ్ఛిన్నముగా ననఁగా నూనెధారవలెఁ దెంపులులేక చెదరక యుండవలయును.ఇది యభ్యాసముచేఁగాని కలుగదు.కావున నీ యభ్యాసమును సాధించు విధమును దెలిపెదను.వానికిఁ గారణములు మీమాంస మఱియొకసారి తెలిపెదను.

భక్తియోగ మనుపక్షికి జ్ఞానయోగముఅష్టాంగయోగమునను నవి రెండు ఱెక్కలు. ఈ రెండును నాఱవ తరగతికి వచ్చువఱకుఁ దగుమాత్రముగను నేడవ తరగతికిఁ దీవ్రముగను గావలసియుండును.కావున నీ సమాజము వా రా సహాయము కోరిరేని నారెంటినిగూడ సాధింపవలసియుండును.అష్టాంగయోగమును మనము సాధింపవచ్చునుగాని తక్కిన హఠలయాది యోగములను సాధింపవలయసిన పనిలేదు.అవి యనావశ్యకములు. అపాయసహితములు.అనేక సహస్రజన్మములకావలఁగాని ఫలమిచ్చునవి కావు.అప్పుడైనను భక్తియోగము రాజ యోగము సాహాయ్యములేక యవి యేఫలమును నొసఁగజాలవు.ఈ రహస్యము తెలియక కొందఱు ముగ్ధులు ముగ్ధరాంధ్రు డాంభికుల వలలలోఁబడి షట్చక్రశోధనము చేసెదమనియు ముద్రల ధరించెదమనియు నీ గారిడి విద్యల వలననే మోక్షమబ్బుననియుఁ బలుకుచుందురు.వీరి కనకేల ?వీరి గురువులకును నుత్తమాసన రహస్యము గాని చక్రలక్షణము గాని తెలియదనియే నా యనుభవముచేఁ దెలిసికొంటిని.ఇట్టి వీరు సద్భావముచేఁ దమ్మాశ్ర యించిన వారిని గామినీ కాంచనాసక్తియే నుభయలోక భ్రష్టులఁ జేయుచున్నారు.

నేను సంచారమునకుఁ బోయిన యొకానొక గ్రామమందు నొక కులస్త్రీ నాయొద్దకు రహస్యముగవచ్చి మాగురువులవారు నాకొక యాసనము నుపదేశించిరి.అది నాకు సరిగా సాధ్యమైనదికాదు.నేను వేయుటయం దేదైనలోపముగలదేమో తెలియఁజెప్పుమని యేకాంతమున నా యాసనము వేసి చూపెను.అమ్మా ! యీ యా సనము మీరు వేయఁదగినది కాదు.ఇది స్త్రీల కుద్దేశింపఁబడలేదు.ఇది స్త్రీలకు సాధ్యనమునుగాదు.ఇంతకు మీరు వేసినది మీరుచెప్పిన యాసనముగాదు.అని చెప్పి యామె చెప్పిన యాసనమును వేసి చూపితిని. నీ వీ యాసనమిట్టు లభ్యసించిన శీఘ్రకాలములోనే నీకు మానహాని కలిగించు రోగమువచ్చుననియుఁ జెప్పితిని.ఆమె కాయాసనము నేర్పిన పాపాత్ముఁ డామెవలన గురు గౌరవము కడుపు కూటికి నాలుగుకాసులును వచ్చునని చూచెనేకాని యామెగతి యేమని యాలోచించినవాఁడు కాఁడు.ఈమె సాహసించి యడుగుటచే నేను సవరింపఁ గలిగితినిగాని లేకున్న నెట్లుండునో.ఇట్లడుగుటకు జంకువారును దమ గురువులు నేర్పినదే యథార్థమని తలఁచి విపరీతాభ్యాసము చేయువారును నిఁక నెందఱున్నారో.ఇట్టి గురువులీకాలమునఁ బెక్కురు గానవచ్చుచున్నారు.కావు న వీరి యాయలలో మీరు పడకుందురని వేఁడుచున్నాను.

నేను దిరువళిక్కేణిలో నుండఁగా నొక హఠయోగి నేనుండు నింటికి నాలుగవ యింటిలో దిగియుండెను. ఆయనకు నాకుఁ బరిచయముగలిగెను.అప్పటికి సిద్ధాసనమును బుస్తకములలోనున్న విధమున వేయుచుండినిగాని దాని రహస్యము తెలియదు రహస్యము విడిచిచెప్పిన యోగగ్రంథ మొకట్టైనలేదు.అప్పటికి నాకుఁదెలిసిన విధ ముగ సిద్ధాసనమువేసి చూపితిని.సరియని యాయనయు నంగీకరించెను.అంతియకాని దానిలో నెంతో కృషిచేయు చుండు నతనికిని దాని రహస్యము తెలిసినదికాదు. ఈ రహస్యములు దెలియక చక్రశోధనముచేసి కుండలను లేపువారే.ఇంతకుఁ జక్రశోధన పద్ధతి నొక జన్మమునఁ గాదననేల నూఱు జన్మములకైన సాధ్యముగాదు.సాధిం చిన వారుగల రందురేని వారికిది వెయ్యవ జన్మమో లేక పదివేలవ జన్మమో యని యెంచుఁడు.అట్టివారు యోగులవంశమునఁ బుట్టియో బాల్యమునుండి యోగుల సహవాసము చేసియో యభ్యసించి యొక్కొక్క జన్మము నఁ గొంత కొంత సాధించి యీ జన్మమునఁ గృతార్థులైరి.అట్టివారుకూడ రాజయోగము భక్తియోగము నభ్యసిం పకున్న వ్యర్థులే.

ఇప్పటి మాయాయోగులకుఁ గొందఱకుఁ గుండలి యెచ్చట నుండునది తెలియదు.తక్కిన చక్రములు బొడ్డులోనున్నది కంఠములోనున్నదని యీ ప్రకారము చెప్పుదుర.ఇదియును గల్లయే.ఉపనిషత్తులు హృదయపద్మ మం దీశ్వరుఁడు గలఁడని చెప్పుచున్నవి. వీ రనాహతచక్రమే యా స్థానమని తలఁతురు.అదియు నసత్యమే.కొం దఱీ రెండు నొకటే యని భ్రమించుచున్నారు.ఇంతకు మూలాధార స్వాధిష్ఠాన మణిపూరకచక్రముల దాఁటువఱకు

మనస్సు ప్రకృతిపదార్థములందే సంచరించుచు క్షుద్రకార్యములందే పోవుచుండును. అంతవఱకు సంచరించుచు క్షుద్రకార్యములందే పోవుచుండును. అంతవఱకు నధోలోకమే. అనాహతచక్రమునకు వచ్చినపుడే యూర్ధ్వగామి యగుటకుఁ బ్రారంభించును. ఈ కాలములో యోగులమని చెప్పువారిలో మూలాధారచక్రమును దాఁటిన వారు మన దేశమున లేరు. ఏ యోగమునకైనను యమనియమములు ముఖ్యములు. ఈ యోగులలో వీనిని సాధించిన వాఁడు గానరాఁడు. వీనిని సాధించి యోగియైనవాఁడు నాలుగు కాసులకై యిూదొంగకూళ్ళు కుడువను గుడువఁడు. అట్టివాఁడు దుర్లభుఁడు ఈ కాలమున సిద్ధాసనమును గేవల కుంభకమును జయించినవాఁడును గానరాఁడు. ఒక సిద్ధాసనమును సాధించుటకే పదిరెండు సంవత్సరముల పట్టును. ఇట్టి యోగమభ్యసించువాఁడు గుహలయం దుండునే కాని గ్రామమధ్యమున వసింపఁడు. పల్లెలయందు వేషములవేసి తిరుగువారిలోఁ ద్రిపురసుందరి యెవతయో, యామె కా పేరేల వచ్చెనో యా మె దేహమున నెందున్నదియో చెప్పగలవాఁ డేఁడీ అనుభవముచేఁ జెప్పకుండినఁ బోనీ. ఆ విషయగ్రంథములనైన వీరు చదివిరా ? వీరు నిర్వికల్పసమాధియని, నిరాలంబ సమాధియని పేర్లుమాత్రము తెలిసికొని తక్కినదంతయు సాధించినట్టులు దానిలోమాత్రము సందేహము వచ్చి నట్టులు ప్రశ్నలు వేయుచుందురు. ఈ యోగలక్షణము, నుపాసింపవలసిన దేవత లక్షణము, తెలియుటకై క్రింది మూఁడు చక్రములలో మూఁడవదియగు మణిపూరకచక్రమును గుఱించి కొంచెము తెలిపెదను.

శ్లో. అత్రాస్తే లాకీని సా సకలశుభకరీ వేదబాహూజ్జ్వలాంగీ
శ్యామాపీతాంబరాద్యై ర్వివిధవిరనాలంకృతామత్తచిత్తా
ధ్యాత్వైతంనాభిపద్మం ప్రభవతినితరాం సంహృతౌపాలనేవా
వాణీ తస్యాననాబ్జే నివసతి సతతం జ్ఞానసందోహలక్ష్మీః
నీలాం దేవీంత్రివక్త్రాంత్రినయనలసితాందంష్ట్రిణీముగ్రరూపాం
వజ్రం శక్తిం దధానా మభయవరకరాం దక్షవామే క్రమేణ
ధ్యాత్వా నాభిస్థపద్మే దశదళవిలసత్కర్ణి కే లాకీనీం తాం
మాంసాశీంగౌరరక్తాసృక్హృదయవతీంచింతయేత్ సాధకేంద్రః

వీనికర్థము. ఇచ్చట (మణిపూరకచక్రమందు)సకల శుభములనిచ్చు లాకినీదేవత గలదు. ఆమె నాలుగుచేతు లఁ బ్రకాశించుచున్నది. నల్లనిది పచ్చనివస్త్రమును నానావిధాలంకారములను ధరించి మత్తెక్కిన మనస్సుగలదై యున్నది. ఈనాభియందుండు నీచక్రమును ధ్యానించువారికిఁబ్రపంచమును సృష్టించుటకు లయింపఁజేయుటకు శక్తికలుగును. జ్ఞానసందోహ సంపత్తిగలవాణి యీతని ముఖమందు వసించును.

ఉపాసకుఁడు లాకినీదేవతను నుపాసింపవలయును. ఆమెనీలవర్ణము మూఁడుముఖములు ముఖమునకు మూఁడుకన్నులు కలిగి భయంకరమై మిట్టకోఱలుగలదియై యున్నది. ఆమె కుడిచేతియందుఁ బిడుగును శక్తియను నాయుధమును నెడమచేతియందు వరదాభయముద్రలను గలదైయున్నది. నాభిపద్మమునఁ బది ఱేకులుగల దిమ్మెయం దీ లాకీనిని ధ్యానింపవలయును. ఈమె మాంసమును భుజించుచుఁ (మాంసమందుండి) జన్నులకు నెఱ్ఱని రక్తమును బూసికొనియుండును.

లయయోగ మభ్యసించువా రెట్టి దేవతల నుపాసింతురో కంటిరా ? తొలి మూఁడుచక్రములందు వీరు పాసించునది శాకినీ–డాకినీ–లాకినీ దేవతలనే, వీరు మాంసాశనులని చెప్పవలయునా ? ఈ యుపాసకులు దేవతల సాధించుటలేదుగాని యా దేవతలపేరు చెప్పి జీవహింసచేసి పాపముల పాలగుచున్నారు.

ఈ సమాజమువా రీ భూతప్రేత పిశాచములపూజవదలి పరమకారుణికుఁడు పరమసత్త్వస్వరూపుఁడు జగద్రక్షకుఁడు భక్తిపాలన దీక్షారతుఁడునైన భగవంతుని సేవించి కృతార్థులౌదురుగాక. యోగమాత్మవిశుద్ధయే యన్నట్లు హఠలయయోగములు మనస్సును శుద్ధపఱచి సవికల్పసమాధిని లభింపఁజేయునేకాని నిర్వికల్పసమా ధిని గలిగింపలేవు. రాజయోగ భక్తియోగముల వలననే నిర్వికల్పసమాధి కలుగఁగలదు. సవికల్పసమాధి లభించిన వారికి మరల జన్మముకలదు. నిర్వికల్పసమాధి లభించినవారికి మరల జన్మములేదు. ఏలయందురేని హఠాదులం దుఁ బ్రాకృతసంసర్గము కొంచెమైన నుండునుగాని లేకపోదు. అది యుండువఱకుఁ బునర్జన్మము తప్పదు. భక్తి రాజయోగులందే యది సవాసనముగ లయించును. తారకసాంఖ్యామనస్కాది యోగములకు దేనికైన భక్తిలేకున్న నవి నిష్ప్రయోజనములు. శ్రమము మాత్రమే ఫలము. వీనిని గుఱించి వ్రాయఁబడిన సీతారామాంజ నేయమందుఁ దొలిపద్యము లెట్లు వ్రాయఁబడినవో చూచుఁడు.

శా. శ్రీమద్దివ్యనిజాంఘ్రిపద్మములు సంసేవించుచున్ భక్తియై
ధీమంతుండగు నాంజనేయుని లసద్దే హేంద్రియాతీతచి
ద్భూమానందుఁడ వీవ నేనని కృపన్బోధించు శ్రీజానకీ
రామబ్రహ్మమునంతరంగమున నారాధింతునశ్రాంతమున్

గీ.	భక్తజనమానసోద్యాన పారిజాత
	సీత కరుణించి నన్ను రక్షించుఁగాత.

మ.	తనరంగాయముచేత రామచరణద్వంద్వైక దాస్యంబు హె
	చ్చిన భక్తిందగువాక్కు చే ననిశమున్ శ్రీరామనామప్రకీ
	ర్తనముం జిత్తముచేత రామపరతత్త్వధానముంజేయుశ్రీ
	హనుమంతున్‌సముపాశ్రయింతుమదభీష్టార్థంబుసిద్ధింపఁగన్

ఈ పద్యమువలన నన్ని యోగములకు భక్తిప్రధానమని ప్రాణభూతమని యేర్ప డెనుగదా. ఇట్టి భక్తిసులభముగ సాధ్యమగు మార్గములుండ నసాధ్యమార్గములఁబోయి శ్రమింపనేల ?

శ్లో.	"అసాధ్యః కస్యచిద్యోగో, జ్ఞానం కస్యచి దేవచ."

కొందఱకు యోగ మసాధ్యము. కొందఱకు జ్ఞానమసాధ్యమని యోగవాసిష్ఠమందుఁ గలదు. కొందఱకు రెండునసాధ్యములే. సర్వజనసాధ్యము భక్తియే.

జ్ఞానయోగము మన కె ట్లసాధ్యమందురేమో. శ్రీశంకరాచార్యులవారి యభిప్రాయము మనకుఁ బ్రమాణమే ని సన్న్యాసి కానివానికి జ్ఞానములేదు. మోక్షములేదు. సన్న్యాసము బ్రాహ్మణులకుఁగాని తక్కినవారికి లేదు. నేను బ్రాహ్మణుఁడనే. సన్న్యాసాశ్రమ స్వీకారము చేయలేదు. ఏల చేయరాదందు రేమో, అది యీ కాలమున స్మృతి విరుద్ధము. "శ్రుతి స్మృతిర్మమై వాజ్ఞా" యని యుండుటచే స్మృతికి విరోధముగ వర్తించి భగవదాజ్ఞ తిరస్కరింపు మనెదరా ? ఇంతకు భగవద్గీత యందు సన్న్యాసాశ్రమము చెప్పఁబడలేదు. నేను సన్న్యాసి నయ్యెదననుకొందు. తక్కిన మీ యందఱు గతియేమి ? మీరిందఱు నరకమునకుఁబోవ నే నొకఁడనుమాత్రము మోక్షమునకుఁ బోవలయునా? ఇట్టి కష్టమునుండి మిమ్ము నన్నుఁ దప్పించుటకే భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు భక్తిప్రవత్తులు ముఖ్యములని యుపదేశించెను.

మంత్రయోగ సమాధియందు మహాభావసమాధి గలుగును. అనఁగా నచంచలత్వము మౌనములభించును. హఠయోగ సమాధియందు నిరుద్ధశ్వాసము, జడప్రాయత్వము కలుగును. లయయోగమందు బాహ్యసంజ్ఞలేక యంతర్దృష్టియుఁ దదీయానందనుభవము కలుగును. ఇది యా సమాధియందుండు కాలమునందుమాత్రమే. ఆవల ఁగాదు. ఈ మూఁడు సాధించిన వారు కామినీకాంచనదాసు లైరని గ్రంథములవలననే తెలియవచ్చెడివి. కొంద ఱగతి మనము కన్నులారఁ జూచుచున్నారము. పరిపూర్ణవైరాగ్యసిద్ధిచే నిట్టి గండముల పాలుపడక రాజయోగి సర్వకాల సర్వావస్థలయందు బ్రహ్మమందే యుండును. ఆయనకు నిత్యసమాధి. భక్తుఁడు నిట్టివాఁడే.

లయయోగమం దాఱువిధములైన సమాధులు గలవు. అందొకటి రాజయోగము మఱొకటి భక్తియోగము.

హఠయోగ లయయోగములందనేక జన్మములు గడపితుదకు రాజయోగము భక్తియోగము సాధింపఁ బూనుటకంటె నారంభమందె రాజయోగ సాహాయ్యముచే భక్తి నభివృద్ధి చేసికొని యొకటిరెండు జన్మములలోఁ గడదేఱుట వివేకి లక్షణము గదా.

కావున సర్వమత సమ్మతమై సర్వజనసామాన్యమై సర్వజన సేవ్యమై సర్వజన సులభమై శీఘ్రఫలదమై నిరపాయమై నిశ్చితఫలమైన యీ మార్గము మన మవలంబించి దరిచేరుదము

సోదురులారా ! సోదరీమణులారా ! శ్రీరామ సేవామతరామధర్మముల వినుఁడు. రామధర్మము లనఁగా నిరువదియైదు ధర్మములని యర్థము. (రా+మ= 25 శ్రీరామ సేవా మత ధర్మములు.)

శ్రీరాముఁడే పరదైవతము.
శ్రీసీతాంజనేయులే యాచార్యులు. పురుషకారభూతులు.
లక్ష్మణ భరతశత్రుఘ్నులే మార్గదర్శకులు.
శ్రీరామ సేవకులే సహకారులు.
శ్రీరామమంత్రమే మంత్రము.
కైంకర్యమే తంత్రము.
'దాసోహమ్' బిరుదుపదము.
శ్రీరామద్వయోచ్చారణ నిత్యయోగమే యోగము.
జపసంఖ్య సాంఖ్యము.
శ్రీరామతారకమే తారకము.
ప్రాకృతామనస్కమే యచలము.
స్మరణమే పరమతపము.
జపమే స్వాధ్యాయము.

ఆత్మనిక్షేపమే యీశ్వరప్రణిధానము.
శ్రీసీతారామమూర్తిపూజయే మహాయజ్ఞము.
భక్తి జ్ఞానప్రదానమే దానము.
తత్పాదతీర్థమే యమృతము.
సుఖాసనమే యాసనము.
అంజలిముద్రయే ముద్ర.
నిర్విచారమే విచారము.ఔ
శ్రీ సీతారామస్వరూపదర్శనానందమగ్నతయో సమాధి.
భక్తి ప్రపత్తులే యుపాయములు.

సాక్షాద్వేదమగు శ్రీమద్వాల్మీకిరామాయణము,ఉపనిషత్సారమైన భగవద్గీత,బ్రహ్మసూత్రార్థబోధక మై భగవత్కథా సుధానిధియగుశ్రీభాగవతము,ప్రస్థానత్రయము.

భగవత్సంకల్పమే కల్పము.

ఈ ధర్మమందుండు వారికిదేహాంతముక్తికరతలామలకము.

కాశికిఁ బయనించు వారేదిసుగమము ? ఏబాట నిరపాయము ? ఏత్రోవ సమీపము ?లోనైనవి విచారించుకొని బయలుదేఱునట్లు మనమును దూరప్రయాణము చేయఁబూనితిమి గనుక నాయామార్గములందలి కష్టసుఖములు తెలిసికొని తరువాతఁ బయనించుట తగును గావున నింతవఱ కావిషయము చెప్పితిని.ప్రతిదినము నడుచుకొనవలసిన విషయములిఁకఁ దెలిపెదను.

"శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్"

అన్ని ధర్మసాధనములందును శరీరసాధనము మొదటిది యను సూక్తి మీ రెఱుగుదురు గదా. శరీరము మంచిస్థితియందు లేకున్న నేపుణ్యకార్యము మనము చేయఁజాలము.నా దేహమువంటి పాడుదేహముగలవాఁ డేకార్యమైన నెట్లు చేయఁగలఁడు ?

"తలఁకెడు వాఁడు గాఁడు భగవత్తుఁడు భీమతనూజుతోడని
ట్టలముగఁ బోరఁజాలు నకటాకరి యోరువదేమిసేయు"

నన్నట్టు రౌతెంత శూరుఁడైనను వాహనము చచ్చుగొడ్డయినచో నతఁడేమి చేయఁగలఁడు ?దేశమేలు చక్రవర్తియై నను నోటి యోడలోఁ గూర్చుండిన వానిగతియేమి ? మనము పూనినది సామాన్య కార్యముగాదు.అపార సంసారసాగరమును దాఁటఁబూనితిమి. ఈ దేహమను నావ సాహాయ్యము చేతనే యా సముద్రమును దాఁట వలయునుగాని వేఱువిధముగ దాఁటలేము.కావున నీ నావ నెట్టిస్థితియం దుంచవలయునో యాలోచింపుఁడు.ఓటి నావయైనచో మనయత్నమేమి సాగును ?మన మనోబలమేమి చేయును ?మన యాత్మబలమేమిచేయును?కావున మనదేహము రోగరహితమైనది గాను బల సహితమైనదిగాను జేయుట ప్రథమకార్యము.అటుచేయక పోయితి మేని మన కార్యము నిర్విఘ్నముగఁ గొనసాగనేరదు.అభ్యాసము దారపుచెండు చుట్టుటవంటిది.ఒక్కసారి చేయి జాఱినఁనెన్ని చట్లూడిపోవునో తెలియునుగదా. అట్లే యొకనాఁడభ్యాసనము మానినఁ బదినాళ్ళ కష్టము వ్యర్థమై మరల మొదలుపెట్ట వలసివచ్చును.కావున మన మహాకార్యము నెఱవేఱుటకు మన దేహములు బలిష్ఠములైనవి గాను రోగరహితము లైనవిగాను నుండఁజేయవలయును.ఈ దేహారోగ్యము బలము పురుషులకు మాత్రమేకాదు స్త్రీలకు బాలురకు బాలికలకుఁ గూడ నత్యావశ్యమని నేను మీకుఁజెప్పవలయునా ? అందఱునారెంటిని సంపాదిం పవలయును.ఆ నిమిత్తమై యుదయమున సాయంకాలమున నరగంటసేపు దేహపరిశ్రమము చేయవలయును.నడ చుట చాలదు, 1.దేహపరిశ్రమము, 2. మనోబలము., 3.ప్రాణాయామముననునీమూఁటిచే వానిని సాధింపవచ్చు ను.ఇప్పుడు వీనిని వివరించి చెప్పి చేసి చూపుచుండినఁ దక్కినవిషయము చెప్పుటకు విరామము లేకపోవును గావున నీ సభ ముగిసిన యనంతరము విరామమున్నచో నీ సమాజము వారికావిధముఁ దెలిపెదను లేదా మఱియొకసారి తెలిపెదను.స్వదేశపుసాము దేహపరిశ్రమముగఁ జాలును.అన్నలారా ! అక్కలారా ! యొకరాజు దూరదేశమందుండు నొకనికికొక గుఱ్ఱము బంపి దీని సాహాయ్యముచే నీవు నాయొద్దకు రమ్మని చెప్పినను కొండు, ఆగుఱ్ఱము లేకున్నఁ బ్రయాణముసాగదు.ఆ గుఱ్ఱముమీఁదఁ గూర్చుండియే పోయి యాగుఱ్ఱమును రాజునకు మరల నప్పగింపవలయునుగదా.అట్లైనచో నీపాంథుఁడెట్లాగుఱ్ఱమును సాఁకవలయును.తెనాలి రామకృ ష్ణుఁడు సాఁకినట్లు సాఁకినఁ బ్రయణముసాగునా ? ప్రభువు దానిని జూచి వాని నడవడికి సంతోషించునా ? అట్టులే మనదేహము. ఆ గుఱ్ఱమునకు దిండి యెక్కువ పెట్టితిమా మనము చెప్పినట్టు వినదు.మనమీఁదనే సవారితీయ యత్నించును. దేహమునకు సరిపడని యాహారము పెట్టితిమా రోగము వచ్చును.కావున మంచి

యాహారముగా మితముగాఁ బెట్టవలయును. అట్టులే మన దేహమునకును గుఱ్ఱమును దినదినము త్రిప్పక లాయములోనే కట్టివేసి యుంచితిమా వేగముగ ముసలిదగును. ఎన్నఁడైనఁ బనిపడి బయటఁ దీసితిమేని యది నడవనే నడవదు. నడచెనా మనల నేగుంతలోనో త్రోయును. అట్టులే మనదేహము.

స్త్రీలకేల దేహపరిశ్రమము దేహబలమని తెలివిలేని వారందురు. దేహబలము లేకుండుటచేఁగదా స్త్రీలు 10-12 ఏండ్లకే సమర్తాడుట 14 ఏండ్లకే ముగ్గురు నలుగురు బిడ్డలను గుంతలోఁబెట్టి మట్టివేయుట, వెంపలిచెట్ల కు దోట్లువేయు నలికినరములవంటి వారిని గనుట, కనలేకచచ్చుట, చావక బ్రతికిన శస్త్రచికిత్సకుల కోఁతలకు మర్మాంగము లర్పించుట, పుట్టిన బిడ్డలను బుట్టినది మొదలు డబ్బీపాలతోనో హార్లిక్సుపాలతోనో పెంచుట, వారుచచ్చీ చావక జీవచ్ఛవములవలెనుండుట, మోఁతచేటుగ ఱొమ్ముఁన మాంసపిండములమోచికొని తిరుగుట తటస్థించు చున్నవి. ఇన్ని యనర్థములకు దేహబలమే దివ్యౌషధము, కావున స్త్రీలకు దేహబలము వచ్చునట్లుచేయుట వారిమేలు, తమమేలు, తమ బిడ్డలమేలు, దేశముమేలుగోరు పురుషులకు విధియైయున్నది. అటుచేయని వారిందఱకు ద్రోహులే. ఈ సమాజమువారికి పరోపకారము చేయుట విధిగావున దీనిని బ్రథమ కర్తవ్యముగా నెంచవలయును.

బలములేని వానికి నాత్మ సాక్షాత్కారము లేదు. సమాధిలేదు. 'నాయమాత్మాబలహీనేన లభ్య' యని శ్రు తి వాక్యము. మనోబలము దేహబలము రెండు నుండినఁగాని యాత్మలాభములేదు. బలము లేకుండుటచేఁగదా మనవారనేక స్త్రీలు పయోధరములైన ఱొమ్ములులేక పాలడబ్బీలు రైకలలోఁ బెట్టుకొని తిరుగుచున్నారు.

నిద్ర, చేయవలసిన కార్యములందు హెచ్చరిక తప్పియుండుట (ప్రమాదము), సోమరితన మనునవి తమోగుణ లక్షణములు తమోగుణమును రజోగుణమును జయించినఁగాని సత్త్వగుణము వృద్ధికిరాదు, గుడ్డి గాద ముందువఱకుఁ బైరు పెరుఁగదు సత్త్వగుణము వృద్ధియైనఁగాని చిత్తశుద్ధిలేదు. చిత్తశుద్ధిలేకున్న మనస్సునకు నిలుకడలేదు. మనస్సు నిలుకడలేని వాఁడన్నిటఁ జెడినవాఁడే. కావున బాలురు బాలికలు నాలుగన్నర గంటకు నిద్రలేవవలయును. పెద్దవారు 3 గంటకు నిద్రలేవవలయును. అట్లనుటచే నంతకుముందు నిద్రలేవఁగూడదని యర్థముకాదు. అంతకుఁ దరువాతఁ బండుకొనరాదని యెఱుఁగవలయును. నిద్రలేచునపుడు హరిహరియని యేడుమార్లుచ్చరించుచు లేవవలయును. నిద్రలేచి కూర్చుండి భూదేవిని జూఱచి "తల్లీ ! నేను బుట్టిన నిమిషమున మొదలు నీవేకదా నన్ను భరించుదానవు భూతధాత్రివి నీవేకదా ! భగవంతుఁడు వరాహమూర్తియైనపుడు నీవే కదా యాయనకుఁ బ్రియరాలవు. ఇట్టి నీ విషయములో దినదినము నే నెన్నియో యపచారములు చేయుచున్నాను. తనపై మలమూత్రములు విడిచి కాలఁ దన్ను శిశువును దల్లి క్షమించి రక్షించునట్లు నీవు నా నేరములు సహిం చి రక్షింపుము" అని మ్రొక్కి లేచి జలపాత్రముతో వెలుపలఁబోయి మూత్రవిసర్జనముచేసి పాదప్రక్షాళనము గావించుకొని వచ్చి కోదండరామమాహాత్మ్యమందలి సుప్రభాతములఁ జదివి యోగ మభ్యసించువారైనచో వేఱాస నమునఁ గూర్చుండి యోగ మభ్యసింపవలయును. యోగమభ్యసించువారు ప్రారంభదశయందు నఱగంట యభ్యసి ంచినఁ జాలును. అఱగంటనుండి యాఱుగంటలవఱకు హెచ్చింపవలయును. ఈ ద్వితీయసోపానమును దాఁటి తృతీయసోపానము నెక్క నాసక్తిగలవారి కా యోగమార్గములు తెలుపఁబడును. ఆఱవతరగతికి వచ్చి యోగ మభ్యసింపఁ గోరువార లాఱు మాసములైనను గేవల మావుపాలు, నెయ్యి, అన్నము, కలకండ తప్ప మఱిదేనిని భుజింపరాదు. రెండుపూఁటల భుజింపవచ్చును గాని మితముగ (సగముకడుపునకు) భుజింపవలయును. పాతి కడుపు నీళ్ళతో నింపవలయును. పాతికడుపు గాలిసంచారమునకై విడువవలయును. ప్రాఁతబియ్యముగాని గోధు మలుకాని యుపయోగింపవచ్చును. ఈ యాహారము తటాలునఁ బ్రారంభింపరాదు. ఉప్పు-చింతపండు-మిరప కాయలు-ఆవాలు-నూనె-యింగువ-చేఁదువస్తువులు. నివి క్రమక్రమముగఁ దగ్గించుచువచ్చి యావల బొత్తిగ నిలువవలయును. మజ్జిగబదు లావుపా లుపయోగింపవలయును. ఇది మూఁడునెలలలో నభ్యసింపవచ్చును. ఆవల నాఱునెలలు కేవలము మీఁదఁజెప్పినట్లు పాలన్నము భుజింపవలయును. ఇట్టివాఁడు యోగాభ్యాసమున కర్హుఁ డగును ఈ విషయమంతయుఁ దృతీయ సోపానంబున వివరింపఁబడును. ఇది సాధింపనివారు యోగవిషయ మాలోచింపవలసిన పనిలేదు. ఇది సాధించినవారికిఁ దక్కిన విషయము లనఁగా నాత్మసాక్షాత్కారమునకుఁ గావలసినవి నేర్పఁబడును.

మీఁదఁజెప్పిన యుప్పు మొదలైనవి రాజసాహారములు. చలిదియన్నము-పాసినయన్నము-తెల్లగడ్డ-యెఱ్ఱ గడ్డ-ముల్లంగిగడ్డ-సొరకాయ-మునగకాయ యెంగిలి యపవిత్రవస్తువులు మధుమాంసాదులు ఇవి తామసాహార ములు.

ప్రాఁతబియ్యము-గోధుమలు-యవలు-నెయ్యి-పాలు-తేనె-పొట్లకాయ-బూడిదగుమ్మడికాయ-లేఁతవంకాయ -కందిపప్పు-పెసరపప్పు-సెనగపప్పు-మినుపప్పు-కలకండ-చక్కెర-సొరెపప్పు-బాదము-తియ్యనిపండ్లు-చము రుగల పదార్థములు-ద్రాక్ష లోనైనవి సాత్త్వికాహారములు. వీనిని మితముగనే తినవలయును.

ప్రథమ ద్వితీయసోపానములం దుండువారు తమ పడుకలమీఁదనే యైదు గంటలవఱకుండి స్తోత్రములు–పాటలు–పద్యములు లోనైనవి చెప్పుచుండవలయును. ఇవి రానివారు రామద్వయ మంత్ర ముచ్చరించుచుండవలయును. అవలఁ బ్రాతఃకాలకృత్యములకై పోవలయును. ఇట్లు పోవునపుడు కేశవ కేశవయని స్మరించుచుండవలయును. భోజనజలకాలంబులఁ దప్పఁదక్కిన యన్నివేళల రామద్వయమే యుచ్చరింపవలయును. భోజనము చేయునపుడు కబళకబళమునకు గోవింద గోవింద యనుచుండ వలయును.

శ్లో. గోవిం దేతి యదా క్రంద,త్కృష్ణా మాం దూరవాసినమ్

ఋణం ప్రవృద్ధఇవ మే, హృదయా న్నా పసర్పతి

దూరముననుండు నన్ను నుద్దేశించి ద్రౌపది గోవిందా యని యఱచెను. ఆ యప్పు నామీఁదఁ బెరుఁగుచు నది నా హృదయమునుండి తొలఁగినదికాదు. అని శ్రీకృష్ణుఁడు చెప్పెను. లేక శ్రీరామమంత్రముతోనే యన్ని కార్యములు చేయవచ్చును.

ఈ సమాజమునఁ జేరినవారు వ్యాధిబాధచేఁ బీడింపఁబడునపుడు తప్పఁ బ్రతిదిన ముదయముననో భోజనమునకు ముందో స్నానముచేయవలయును. స్నానముచేయునీటిని రామమంత్రముతో నభిమంత్రించి యా నీటితో స్నానముచేయవలయును. వారివారి దేహస్థితికొలఁది చల్లనీటనో వేఁడినీటనో స్నానముచేయవచ్చును. చల్లనీట స్నానముచేయువారు శిరస్స్నానము చేయవలయును. వేఁడినీట శిరస్స్నానము చేయరాదు. వేఁడినీరు తలపైఁ బోసికొనుటవలనఁ గన్నులకు మెదడునకుఁ గీడుకలుగును. స్నానముచేసి వారివారి మతసంప్రదాయము ప్రకారము ముఖమునఁ బుండ్రము ధరింపవలయును. శూన్యలలాటముతోఁ బాడుమొగముతో జాపాదులు చేయరాదు. ముత్తైదువలు కుంకుమము ధరింపవలయును. ఈ కార్యముకూడ రామమంత్రముతోనే చేయవలయును.

స్వమతనిరోధము కాకున్నచో నందఱు పురుషులు శ్రీరామపాదాకృతిగాఁ దిరుమణి శ్రీ చూర్ణమును ముఖమున ధరింపవలయును.

స్నానముచేసి మడుఁగువస్త్రముల ధరించి పుండ్ర ముంచుకొని రామకోటివ్రాసి జపముచేసి సంస్కృతమునఁ జదువఁగలవారు సంస్కృత శ్రీమద్వాల్మీకి రామాయణమును,సంస్కృతము రానివా రాంధ్రవాల్మీకిరామాయణమును లేక సుందరకాండమునైనను దినమున కొక సర్గమువంతునఁ బారాయణము చేయవలయును. సంస్కృతమునందుఁగాని తెనుఁగునందుఁగాని భగవద్గీతయుఁ జదువవచ్చును. చదివినది తమ కర్థమగుచుండవలయును వచనభగవద్గీతయైనను దోషములేదు. రామాయణము పట్టాభిషేకమువఱకుఁ జదువుటకు సంవత్సర మాఱునెలల పట్టును. బియ్యమేర్పఱుచు స్త్రీలు తీరికయున్నప్పుడంతయు నాపని చేయవచ్చును. కూర్చుండి బియ్యమేర్పఱచుటకు వలనువడనప్పుడు రామద్వయ ముచ్చరింపవలయును. రామకోటి వ్రాయువారు లక్షకొకసారి యథాశక్తియన్న దానము సేయుట క్షేమకరము. జపముచేయువారును నిట్లు చేయుటమేలు. అది శాంతికరము. తగిన శాంతిలేక చేయుట మేలుగాదు. శక్తికిమించి చేయవలయునని నిర్బంధములేదు. వంచన లేని భక్తి ప్రధానము. ద్వితీయసోపానముప్రకారము వర్తించువారు శ్రీ రామమంత్రమును బూఁటకు 1008 మార్లు జపింపవలయును. స్నానానంతరము రామకోటి శ్రీరామ శ్రీరామ యని వ్రాసినఁ జాలును. భోజనానంతరమును రామకోటి వ్రాయవచ్చును. జపావసానమునఁ జెప్పవలసిన మంత్రములను గడపటఁ జెప్పెదను. ఏ రామమంత్రము జపించువారైనను గడపట వాని నొకసారి పఠింపవలయును. అందష్టాక్షరి జపించు వారు ముఖ్యముగఁ బఠింపవలయును. తెలియవలసిన విషయమంతయు దానియందుఁ గలదు.

శ్రీరామమంత్రము సామాన్యమైనదిగాదు కొన్ని మంత్రములు భుక్తిమాత్ర మిచ్చును. కొన్ని ముక్తితమాత్ర మిచ్చును. శ్రీరామమంత్రము రెంటిని నిచ్చును.

శ్లో. తత్త్వమస్యాదివాక్యంతు,కేవలం ముక్తిదం యతః

భుక్తిముక్తిప్రదం చైతత్, తస్మా దప్యతి రిచ్యతే

అని యుపనిషద్వాక్యము.

కొన్నిమంత్రములు కొన్నిమతముల వారికే యుపయోగించును.

శ్రీరామమంత్రము సర్వ సామాన్యముగ నందఱ కుపయోగించును. కావున నీ మంత్ర మాచండాలము జనింపవచ్చును. అన్ని యాశ్రమములవారు జపింపవచ్చును.

శ్లో. మనుష్యేషుచ సర్వేషా, మధికారో స్తి దేహినామ్

ముముక్షూణాం విరక్తానాం,తదా చాశ్రమవాసినామ్

ప్రణవత్వా త్సదా ధ్యేయో, యతీనాం చ విశేషతః

రామమంత్రార్థవిజ్ఞానీ, జీవన్ముక్తో నసంశయః–

దేహములుగల సర్వమనుష్యుల కిమంత్రోచ్చారణమందధికారముగలదు. మోక్షముగోరువారును,విరక్తులును

బ్రహ్మచర్య గార్హస్థ్యవాన ప్రస్థాశ్రమములందుండువారును,దీనికధికారులే.వారిలో యతులు ప్రణవార్థము కలదై ప్రణవమువంటి దగు దీనికి విశేషించి యధికారు లగుదురు.రామమంత్రార్థమును దెలిసినవాఁడు నిస్సందేహముగ జీవన్ముక్తుఁడు.

అని రామ రహస్యోప నిషత్తునందుఁగలదు.

శ్లో. రామ ఏవ పరంబ్రహ్మ, రామ ఏవ పరంతపః
రామ ఏవ పరంత త్త్వం, శ్రీరామో బ్రహ్మతారకమ్
అని యుపనిషత్తే చెప్పుచున్నది.

ఇతిరామ పదేనాసౌ పరబ్రహ్మ భిధీయతే.

అని యనేక ప్రయాణములు గలవు.ఈ విషయము శ్రీరామనామ మహాత్మ్యమందుఁ గననగు.శ్రీరామ మంత్రప్రభావముంగుఱించి శివుఁడు పార్వతి కుపదేశించిన వాక్యములు శ్రీసీతారామాంజనేయమునుండి యనువదించుచున్నాను.

క. ఆదిపరబ్రహ్మప్రతి,
పాదక మత్యంతపరమ పావనము సుమీ
యీ దివ్యమంత్రరాజము,
మోదితధర్మార్థ కామమోక్షప్రదమున్.

క. సత్య జ్ఞానానంద,
ప్రత్యగభిన్నాత్మునందు బ్రహ్మాదిబుధుల్
నిత్యము రమించుచుండఁగఁ,
గాత్యాయని ! రామపదము గలిగెఁ బరునకున్.

గీ. రామ తారక పావన రామనామ
మెంత పాపంబు నడఁగించు నంతయఘము
శ్వపచుఁడైనను జేయఁగాఁ జాలఁ దనఁగఁ
దత్ర్ప భావంబు నెన్నంగఁ దరమోనాకు.

క. ఈరేడు జగములందును,
నారీమణి విమల రామనామముచేతన్
జీరఁబడని ఘనదర్భర,
ఘోరమహోఘంబు లేదు కోరి వెదకినన్.

తే. బ్రహ్మహత్యాయుతము మద్యపాన దశశ
తమును గుర్వంగనా కోటి గమనదురిత
మపరిమితహేమ చౌర్యంబు లనవరతము
రామ నామాభి హతము లో రాజవదన.

సీ. బ్రహ్మహత్యాఖ్య పాపతమోర్క బింబంబు
మధుపాన దోషాభ్ర మారుతంబు
తపనీయ చౌర్యపాతకశైలభిదురంబు
గురువధూగమ నాఘకుంజరహరి
జననీ పితృభ్రాతృ వనితార్భకా చార్య
గోవధార ణ్యౌరు దావవహ్ని
పరసతీ సంగమ పరధన హరణాది
ఘోరపంకోరగ క్రూరబర్హి
యనృతభాషణవల్లి మహాలవిత్ర
మార్యదూషణ పంకేరుహ ద్విపేంద్ర
మఖిల కలుషాంబునిధి బడ బానలంబు
రామ నామంబు హిమశైల రాజతనయ.

తే.గీ. రమణీ ! యవశముచేనైన రామనామ
మమరఁ గీర్తింపఁ బడుచుండ నఖిలపాత
కములచే విడ్వఁబడుఁజుమ్ము సుమతి యపుడ

సింహ మతిభీత మృగములచేతఁ బోలె.

తే. గీ. అనవరతరామ నామకీర్తన పరుండు
వెనుకటి యఘంబులఁ దలంచి వెఱవవలదు
ఘనత నేనుఁగు నెక్కి కుక్కలను గాంచి
భయపడఁగ నేల మనుజుఁ డోపంకజాక్షి.

క. ఇలలోన రామనామము
సులభంబై వెలుఁగుచుండఁ జలకగఁ బలుకం
బలునాలుక గలుగఁగ న
ల్పులు మిన్నక నరకములను బొందెద రకటా.

ఉ. ప్రాపుగ రామనామము నిరం
తరమున్ భజియించు వారికిన్
బాపము లేదటంచుఁ బెనుపా
ము నను బట్టఁగవచ్చు, నగ్నిసం
దీపిత లోహఖండము నతి
త్వరితంబుగ మ్రింగవచ్చు, బ
ల్కోపముఁబెంచు పెద్దపులి
కోఱలు దియ్యఁగవచ్చు నియ్యెలన్.

క. ఏ పాపమునైనఁ దగం
బాపఁగలదు, రామనామ భజనవరులకున్
బాపము గలదని పలుకుమ
హాపాతకి యఘము నడఁప నది యోపదిలన్.

సీ. ద్విజవరేణ్యులకును,విప్రోత్తములకు యో
గీశ్వరులకును యతీశ్వరులకు
భక్తివైరాగ్య సంపద్విశిష్టులకు నే
కాంతవాసులకు వేదాంతులకును
జండాల పుల్కస శ్వపచ కంక కిరాత
శబరహూ ణాంగనా సంగతులకు
బ్రహ్మ హత్యానురా పానహేమస్తేయ
గురవధూసంగమ కరజనులకు

తే. సుందరీ క్షత్రియోరవ్య శూద్రులకును
మఱియు నానావిధానేక మానవులకుఁ
బరమ పావనమై శుభప్రదమునైన
రామనామంబె శరణంబు రాజవదన.

చ. కనదురు రామనామమునకంటె ఘనంబగు పాపనాశసా
ధనము, నిరంతరేష్ట ఫలదాయకమైన విశేషకారణం
బును, మఱిలేదులోకమున మూఢులెఱుంగరుదానినాశ్ర
చినసకలార్థ సంపదలు చేకుఱుసిద్ధము శైలనందనా.

గీ. అబల శ్రీరామరామ రామాఖ్యమంత్ర
మీ ప్సితంబుల నర్థుల కిచ్చుచుండఁ
గాంచి నెఱసిగ్గుపడచుండుఁ గల్పతరువు
కామధేనువు నలఘు చింతామణియును.

సీ. ధర్మార్థులకుసర్వ ధర్మంబు లొనగూర్చు
నర్థార్థులకుఁజేయు నర్థములను
గామార్థులకు నెల్లకామంబుల నొసంగు
నాత్మజార్థుల కిచ్చు నాత్మజులను
శ్రీ ధృతి స్మృతి యశశ్శ్రేయస్సుఖ క్షమా

విద్యార్థులకు వాని వెలయనిచ్చు
ఛత్రచామర గజాశ్వ ప్రభుత్వార్థుల
కవియ సంపాదించు ననవరతముc
గీ. జంద్ర సూర్యాలయంబుల స్వర్గలోక
నిత్యవైకుంఠ కైలాస సదనములను
గోరువారల కవియుc జేకూరcజేయు
రామనామంబు విలసిల్లి రాజవదన.
సీ. నిఖిలరోగంబుల నిర్మూలముగcజేయు
భవభయంబులనెల్లc బాఱcదోలు
బంధనంబులc బటా పంచలు గావించు
నొలయు నాపదలను నులిమివైచు
శాత్రవవిజయంబు సతతంబు సమకూర్చుc
దూలించు బహువిధ దుఃఖములను
దలcపజూపకుండ దుర్దశలను దొలcగించు
సకల శుభంబుల సంగ్రహించుc
తే. బరమపావన మంగళ ప్రదముగానc
గలితధర్మార్థ కామ మోక్షములలోన
నెసcగుభక్తుల కొసcగని దెద్దిలేదు
ఏమి చెప్పుదు శ్రీరామనామ మహిమ
కం అచ్చటనె సరస్వతియును
నచ్చట భాగీరథియును యమునానదియున్
అచ్చట సమస్త తీర్థము,
లెచ్చట శ్రీరామనామ మెప్పుడు గలుగున్
గీ. తవిలి శ్రీరామనామ సుధారసంబు
నమృతులై కోరు భక్తుల కమృతమేల
నమర నమృతాంధసులచేత నదియె మిగులc
గోరc బడుచుండుc గావున వారిజాక్షి.
గీ. కోరి మునుగానని మనుష్యుc బేరుపెట్టి
చీరిన నతం దగనిచెంతc జేరునట్లు
తన్నెఱుంగక తనపేరుc దలcచినతంతc
గరుణచే రాముc డపుడె సాక్షాత్కరించు.
మ. రామరామ రామరామ రామరామ యంచు శ్రీ
రామరామ రామరామ రామరామ యంచు శ్రీ
రామరామ రామరామ రామరామ యంచుc ద
న్నామకీర్తనంబుc జేసినంతc గల్గుమోక్షమున్
కం. నిరతంబు రామనామ
స్మరణంబునకంటె మోక్షసాధన మితరం
బరయంగ లేదు ధరలోc
బరమసులభమైన లసదుపాయం బబలా.
గీ. రామరామ యటంచును గాముకుండు
మోహమునc బ్రేయసిని బిల్వ మోక్షమొసcగు
రామనామంబు హిమశైలరాజతనయ
గాన వర్ణింపcగాc జాల దానిమహిమ.

ప్రభావము తెలియకున్న భక్తిపుట్టదు గావునc దెలిపితిని.

ఇట్టి శ్రీరామమంత్రమును వదలి క్షుద్రమంత్రములకు క్షుద్రదేవతలకై దేవురులాడువారు తియ్యనిచెఱుకును జేతనుంచుకొని వంటచెఱకు నమల యత్నించువారేకదా. శ్రీరామమంత్ర యోగ్యతలు గుణములు సంకల్పములు

నాలోచించి యాయా మంత్రమును గురువువలన నుపదేశమునొంది జపింపవలయును. జపమేకాంతస్థలమునం జేయవలయును. నాలుకగూడc గదలరాదు. మనస్సులోనే యర్థానుసంధానముతోడc జేయవలయును. జపము చేయునపుడు మనస్సు చెదరెనేని నమోనారాయణయ యని యెనిమిదిమార్లు దృఢముగ జెప్పిన మనస్సు దృఢ ముగ నిలుచును. 20 నిమిషములు చక్కcగc బ్రాణాయామముచేసిన నొకటిన్నరగంటసేపు మనసు చెదరక నిలుచును. జపముచేయునపుడు వ్రేళ్లు పై ముఖముగ నుండవలయును. చూపుడు వ్రేలు జపమాలకుcదగులరాదు మేరుపూసను దాcటి జపమాల త్రిప్పరాదు. జపించుటకుముందు గురువును ధ్యానము చేయవలయును. సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నులను హనుమంతునిధ్యానింపవలయును. జాతాశౌచమ్మృతాశౌచము లందును బహిష్ఠలైన స్త్రీలును జపింపరాదు. ఈ సమయము లందైనను ద్వయమును జపింపవచ్చును. జపముచేయువారు స్వస్తిక,పద్మ,బద్ధపద్మ, సిద్ధాసనములలో దేనినైన వేసికొనవచ్చును. స్త్రీలకుc బురుషులకు స్వస్తికాసనము సుఖాసనము. యోగాభ్యాసకులు తక్కినవి సాధింపవలయును. జపముచేయుకాలమున శ్రీసీతారామలక్ష్మణుల విగ్రహములుగాని శ్రీరామపంచాయత నముగల పటముగాని యెదుర నుంచుకొనుట ముఖ్యము. ఇట్లుంచుకొని శ్రీరామమూర్తిని గాలివ్రేళ్లుమొదలు శిరస్సువఱకుc గ్రమముగc ధ్యానించుచుc జూచుచుండవలయును. కొంతసేపు కన్నులు విచ్చిచూచి యావలcగన్ను లు మూసికొని యా యా యవయవములను సంకల్పముచేc జూడవలయును. ఇట్లుమూర్తియంతయుcదలcచిన చోట నెల్లcగన్నులు మూసిన గోచరించువఱకుc దప్పక చేయవలయును. తరువాతc జేయవలసినది తృతీయసోపా నమునc జెప్పcబడును.

శ్లో. ద్విభుజం స్వర్ణరుచిర, తనుం పద్మనిభేక్షణమ్
ధనుర్బాణధరం వందే, రామారాధన తత్పరమ్.
ఇది లక్ష్మణ ధ్యానశ్లోకము.

శ్లో. భరతం శ్యామలంశాంతం, రామసేవా పరాయణమ్
ధనుర్బాణధరం వీరం, కై కేయీ తనయంభజే
ఇది భరతధ్యానశ్లోకము.

శ్లో. ద్విభుజం స్వర్ణవర్ణాభం,రామసేవాపరాయణమ్
లవణాసురహంతారం,సుమిత్రాతనయంభజే
ఇది శత్రుఘ్న మంత్రము.

శ్లో. ద్విభుజం స్వర్ణవర్ణాభం, రామసేవాపరాయణమ్
మౌంజీకౌపీనసహితం, ధ్యాయేత్ శ్రీరామసేవకమ్.
ఇది హనుమంతుని ధ్యానశ్లోకము.

సీతాధ్యానమంత్రము రామధ్యానమంత్రమందే కలసియుండును.

ఎవ రేమంత్రము నుపదేశమున నొందుదురో తెలియదు గావున మూలమంత్రవిషయము చెప్ప సాధ్య పడదు. దాని నా యా గురువులవలననే తెలసికొనవలయును.

శ్రీరామద్వయమును శ్రీరామచరమ శ్లోకమగు

శ్లో. సకృదేవ ప్రపన్నాయ, తవాస్మీతి చయాచతే
అభయం సర్వభూతేభ్యో, దదా మ్యేత ద్వ్రతం మమ.

అను దీనిని గురువులవలననే మూలమంత్రముతోపాటుపదేశమునొంది వాని యర్థతాత్పర్యముల ననుసం ధించుచుండవలయును. ఈ మంత్రత్రయముతప్ప నీ సమాజమువారే యితర మంత్రములను నేరువవలసిన పనిలేదు.

శ్రీ సీతారామలక్ష్మణుల విగ్రహములు తీసికొన శక్తిలేని వారు రామపంచాయతనపటమును,దానిని దీసికొనలేని బీదలు శ్రీసీతారామలక్ష్మణాంజనేయులుండు పటమునుగానితీసికొనువలయును. ఈ పటములు చెన్నపురి తిరువళిక్కేణిలో శ్రీరామజయమందిరమందును,ఒంటిమిట్టలో శ్రీరామసేవా కుటీరము మందును దొరకును. వీని నెదురనుంచుకొనుటకు వల్లలేనప్పుడును,గ్రామాంతరసంచారము పోయినపుడును దాము ధరించి యుండు శ్రీరామస్మరణ చిహ్నమునే వానిమాఱుపయోగింపవచ్చును. ఇంటియందున్నప్పుడును నీ పతకమును దేవపూజవేళ నభిక్షేకించి యాతీర్థమును దొలసిదళముతోc బుచ్చుకొనుచుండినc జాల మేలుగలదు. ఈ నిమిత్త మై కోరిరేని మీయొద్దనుండు పతకములను నే నొంటిమిట్టయందుండు సమయమునc బంపిన నలువది దినములు క్షీరాభిషేకముచేసి లక్షజపముచే మంత్రించి పంపcబడును. ఈ సాహాయ్యము స్వశక్తి చాలనివారికిని, బురుషసాహాయ్యములేని స్త్రీలకేగాని స్వయముగc జేసికొను శక్తిగల వారికిని, నిట్లు చేయcగలవారుగల వారికిని గాదు. దాని నావలనప్పుడప్పుడు పాలతోc గడుగుచు మైల సోcకకుండ నుంచుకొని యా తీర్థమును దీసికొనినc

బీడలు తొలఁగును. ఈ నిమిత్తమై యిది పంపుటకుఁ దెప్పించుకొనుటకునగు టప్పాల్ వ్యయముగాక మఱి యేమియు వెచ్చింపఁ బనియుండదు. మీరుభక్తితో దానినుపయోగించుకొనుచు బాగుపడినఁ జాలును ప్రతిగృహ మందును దులసిచెట్టుండ వలయును. ఈ బృందావనము ముందలికి ప్రతిదినము స్త్రీలు ముగ్గుపెట్టవలయును. విగ్రహములు పటములు నింటియందుఁ బరిశుద్ధమై ప్రత్యేక స్థలమందుండవలయును. అక్కడ నెంగిళ్ళుమ్ములు నసహ్య పదార్థములు నుంచరాదు. ప్రతిదిన మలికి ముగ్గుపెట్టవలయును పూజాకాలమందు దీపములుంచవలయు ను. పూజానంతరము చేసినవంటక మారగింపు పెట్టవలయును. ఇట్లారగింపుపెట్టక భుజింపరాదు తినినను-త్రావి నను-నిద్రించినను-ఉత్తరాలు వ్రాల్చినను-దెఱిచినను-జపించినను-స్నానదానములు చేసినను-ధర్మముచేసినను- మఱి యేకార్యము చేసినను శ్రీరాముల స్మరించి యాయన ప్రీతికై చేయునట్లు భావింపవలయును. ఏ కార్యమైనను దననిమిత్తమై తనవారినిమిత్తమైచేయుచున్నానని తలంపరాదు. అంగడినుండి యేవైన వస్తువులు దెచ్చునపు డెవరికని యెవరైన నడిగిన రామకైంకర్యర్థమని చెప్పవలయును.

భోజనమునకు ముందుగ నన్నమునకును భగవంతునకును నమస్కరించి "స్వామీ ! నేను నీ సేవచేసి తరించుటకైకదా నా కీ కరణబరమిచ్చి దానిని భోషింప నీవే యీ యాహారమై నీ యుపకరణములైన దేహేంద్రి యాదులచే దీని నాహరింపఁ జేసికొనుచున్నావు" అని ధ్యానించి గోవింద నామస్మరణము చేయుచు మౌనియై భుజింపవలయును. కట్టివిడిచిన వస్త్రమును మరల నుతికి యారవేయక మరలఁ గట్టరాదు. ఆచారముల విషయమై హితచర్యలయందు వ్రాసితిని. వానిని జూచి తెలిసికొనవలయును. భోజనానంతరమున వారివారి కార్యములకు వారువారు పోవచ్చును. అవశ్యము మాటలాడవలసిన విషయములుండిన మాటలాడవలయునుగాని యుబుసు పోకకు మాటలాడరాదు. సాయంకాలము కాఁగానే కృత్యములఁదీర్చి యుదయమునందువలెనే భోజనము చేయవల యును. 6 గంటలలకు ముందు పండుకొనరాదు. 10 గంటలకావల మేలుకొనరాదు. యోగ మభ్యసించువారు 12 గంటలకో 1 గంటకో లేవవలయును. అప్పటికి రాత్రి తినిన యాహారము జీర్ణమై యుండవలయును. కావున రాత్రి యాహారము లఘువు గాను శీఘ్రముగ జీర్ణించునదిగా నుండవలయును. పండుకొను వఱకు భగవత్కథలు చెప్పుటయందోవినుటయందో స్మరించుట యందో లేక రామద్వయము జపించుటయందో కడపవలయును. భగవ త్ స్మరణముతోనే నిద్రింపవలయును. ఈ దేహము మనదికాదు. భగవత్పరిణామము. మనకోసమై యది దినమంత యు శ్రమించెను. కావున దానికి విశ్రాంతి గలిగించుట కృతజ్ఞునికి విధిగదా. కావున నదియు భగవత్కైంకర్యమే యనుచు శ్రీ సీతారామమూర్తుల స్మరించుచు వారి పాదములయందుఁ దన శిరస్సు మోపినట్లు భావించుచుఁ బండుకొని నిద్రింపవలయును.

ఇట్లు చేయువా రాఱవ యధికారమును బొందినవారగుదురు. ఏడవ యధికారవిషయము తృతీయసోపాన మునఁ గననగు. దానియందు సమాధి సాధించువిధము తెలుపఁబడును. అప్పటినుండియే ప్రేమభక్తి ప్రారంభమగు ను. అదియే ఫలకారి. ఈసమాధి యోగముచేనైన సాధింపవచ్చును. ఈ మార్గములు తృతీయసోపానమునఁ జెప్పఁబడును ద్వితీయసోపానము దాఁటి తృతీయసోపానముపై నడుగుపెట్టఁ దలఁచినవా రీ మాత్రము సాధించి యుండవలయును.

పూటకు 1008 మార్లకుఁ దక్కువ రామమంత్రము జపింపరాదు.

దినమునకు 3000 కుఁ దక్కువ రామకోటి వ్రాయరాదు.

సాత్త్వికాహారమునే తీసికొనవలయునుగాని రాజసతామ సాహారములను బొత్తిగఁ దీసికొనరాదు.

రాత్రులందు 5 గంటల కెక్కువ నిద్రింపరాదు.

శ్లో. ఆహారః కలహః కండూ, నిద్రా మైథున మేవచ
అభ్యాసేన వివర్ధంతే, యథేచ్ఛసి తథాకురు.

ఆహారము-గలహము-దురద-మైథునమనునవి యభ్యాసముచేయు కొలఁది హెచ్చగును. తగ్గించుకొలఁది తగ్గును. అభ్యాసముచేతను, ఒక కాగితముమీఁదఁగాని గోడమీఁదఁగాని దమ్మిడి వెడల్పు నల్లచుక్క పెట్టి కన్నుల నీరుగాఱువఱకు దృష్టించి చూచినను నిద్రతగ్గును. ఇట్లు కొన్నా ళ్ళభ్యసింప వలయును. అల్పాహారముచేతను నిద్ర తగ్గును.

సమశ్వాస మభ్యసించి యుండవలయును.

సమశ్వాసమనఁగా నేకతాలమువలె నొక్కవిధముగ నుచ్ఛ్వాస విశ్వాసములు సర్వదా పుచ్చుట. దీనిని సాధించు వారు స్వస్తికాసనమందో పద్మాసనమందో కదలక కూర్చుండవలయును. అరచేతులు జ్ఞానముద్రతో పైకిఁద్రిప్పి తొడలమీఁద నుంచుకొనవలయును. ఇతర విచారములన్ని మానవలయును. ఇట్లు 4-5 నిమిషములు గూర్చుండి తమ శ్వాసము ముక్కురంధ్రములవెంట నెట్లు వచ్చుచున్నది పోవుచున్నది దృష్టించి పరీక్షింపవలయును. ఒకసారి మెల్లగ రామ్ అనునంతలో వాయువు లోపలికిఁబోయి వెంటనే వెలుపలికి మెల్లగా రామ్ అనునంతలో

వచ్చి మరల రామ్ అనునంతసే పూరకుండి యావల మరల శ్వాసము నట్లే లోపలికిఁ బోవలయును. ఇది సహజపద్ధతి, ఈప్రకారము సర్వదా చరించుచుండవలయును. భోజనానంతరము—త్వరగాఁ దిరిగినపుడు – మెట్లెక్కినపుడు కష్టము చేసినపు దుచ్ఛ్వాసనిశ్వాసములు శీఘ్రముగ నడచును. కావున మితభోజనము చేయవలయును. మెల్లగ సంచరింపవలయును. శ్వాసము స్వాధీనపడినపిమ్మన నడచునపుడు కూర్చుండి నప్పటివలె నేకవిధము శ్వాసము నడపఁగలవాఁడు శీఘ్రముగ నడచినను నలువదిమైళ్లోక్కసారిగ నడిచినను భయములేదు. బయలుదేఱునపుడు శ్వాసమెట్లునడచుచున్నదో గమ్యస్థానము చేరినపు డట్లే శ్వాసము నడచుచుండవలయును.

స్వస్తి కాసనమందు 3 గంటలు కదలక కూర్చుండవలయును.

బద్ధపద్మాసనమం దరగంటయైనఁ గూర్చుండవలయును.

ఇతర కార్యముచేసి చాలింపఁగనే తనంతటఁ దానే యే ప్రయత్నములేక రామద్వయమంత్రము మనస్సునకు స్ఫురింపవలెను. నోరు వల్లింపవలయును.

ఈమాత్రము సాధించినవాఁడు తృతీయసోపానముపై నడుగు పెట్ట నర్హుఁడు ఇవన్నియు సంవత్సరములోపల సాధింపవచ్చును.

ఎడమతొడకు పిక్కకునడుమ కుడిపాదమును, కుడితొడకు పిక్కకునడుమ నెడమపాదమును నుంచి కూర్చుండిన స్వస్తికాసన మగును.

ఎడమతొడమీఁదఁ గుడిపాదమును,గుడితోడమీఁద నెడమపాదము నుంచి చేతులు వీఁపుప్రక్కగ రానిచ్చి కుడిచేతి వ్రేళ్ళతోఁ గుడికాలి బొటన వ్రేలిని, నెడమచేతివ్రేళ్ళతో నెడమకాలి బొటనవ్రేలిని బట్టుకొని కూర్చుండిన బద్ధ పద్మాసనమగును. దీనియందు సమశ్వాసము రూఢిపడును. అనేక రోగములు దీనివలనఁ బోవును. దీనిని సాధించువఱకు దేహము మనకు స్వాధీనపడినదని తలంపరాదు.

ఈ రెంటికంటె గొప్పదియు నాసనముల నన్నిటిలో శ్రేష్ఠమైనదియు సిద్ధాసనము. దానినిగుఱించి తృతీయసోపానమునఁ దెలుపఁబడును.

స్వస్తికాసనమందు 3 గంటలుగాని బద్ధపద్మాసనమందు నరగంటగాని కూర్చుండఁగలవాఁడు సిద్ధాసనాభ్యాసమున కర్హుఁడు. ఇట్టివారి కిది సమక్షమునఁ జెప్పఁబడును. యోగ మార్గమునఁగాక కేవల భక్తిమార్గమునఁ బోవువానికి బద్ధపద్మాసనము. బంధసహిత సిద్ధాసనము సాధింపకుండినను లోపములేదు. స్వస్తికాసనము బంధరహితసిద్ధాసనము చాలును. అవియే సుఖాసనములు. ఈ యాసనముల పటములకు దృతీయ సోపానమందుఁ గననగు.

సాత్త్వికాహారమున గుఱించి రుక్మాంగద చరిత్రయందు మీరు చదివియే యుందురు.

ఈ రెండవసోపానమున నుండువారు ఆంధ్రభాగవతము—ఆంధ్రవాల్మీకిరామాయణము—భగవద్గీత వచనము—శ్రీకృష్ణలీలామృతము—శ్రీకృష్ణావతారతత్త్వము –ఒంటిమిట్ట రఘువీరశతకము—ఒంటిమిట్ట కోదండరామ మహాత్మ్యము—టెంకాయచిప్పశతకపీఠిక—భద్రాద్రి రామదాసుచరిత్ర—భక్తవిజయము—శ్రీరామనామమాహాత్మ్యము—శ్రీరామతారకశతకము—నృసింహ శతకము—హనుమదాచార్యోపదేశము—హనుమంతునిచరిత్రము—సీతాదేవిచరిత్రము ఇవి చదివికాని చదివించికొని వినికాని యుండిన భక్తి స్థిరపడును. రఘువీరశతక—రామతారకశతక—నృసింహ శతములలోని పద్యములు ముఖస్థములఁ జేసి యుదయమున సాయంకాలమునఁ జెప్పుకొనుచుండవచ్చును.

జపాంతమునఁ బఠింపవలసిన శ్లోకములు.

శ్లో. ససర్వసిద్ధి మాసాద్య, హ్యంతే రామపదంవ్రజేత్
చింతయేచ్చేతసా నిత్యం, శ్రీరామ శ్శరణంమమ ॥
చిద్రూపస్మాత్మ నోరూపం, పారతంత్ర్యం విచింత్యచ
చింతయేచ్చేతసానిత్యం,శ్రీరామ శ్శరణంమమ ॥
ఆత్మాధారం స్వతంత్రంచ, సర్వశక్తిం విచింత్యచ
చింతయేచ్చేతసానిత్యం,శ్రీరామ శ్శరణంమమ ॥
నిత్యాత్మగుణ సంయుక్తో, నిత్యాత్మ తుమండిత
నిత్యాత్మ కేళీనిలయః, శ్రీరామ శ్శరణంమమ ॥
గుణలీలా స్వరూపేషు, మితర్యస్యన విద్యతే
అతోవాఙ్మన సా ఽవేద్యః, శ్రీరామ శ్శరణంమమ ॥
కర్తా సర్వస్యజగతో, భర్తాసర్వస్య సర్వగః
సంహర్తా కార్యజాతస్య,శ్రీరామ శ్శరణంమమ ॥

వాసుదేవాది మూర్తీనాం,చతుర్ణాం కారణంపరమ్
చతుర్వింశతిమూర్తీనా,మాశ్రయః శరణంమమ ॥
నిత్యముక్త జనైఃపుష్టో,నివిష్టః పరమేపదే
పరం పరమభక్తానాం, శ్రీరామ శ్శరణంమమ ॥
మహదాది స్వరూపేణ, సంస్థితః ప్రాకృతేపదే
బ్రహ్మాది దేవరూపైశ్చ, శ్రీరామ శ్శరణంమమ ॥
మన్వాది నృపరూపేణ, శ్రుతిమార్గం బిభర్తియంః
యఃప్రాస్యతే స్వరూపేణ, శ్రీరామశ్శరణంమమ ॥
ఋషిరూపేణ యోదేవో,వనవృత్తి మపాలయత్
యోంతరాత్మాచ సర్వేషాం,శ్రీరామ శ్శరణంమమ ॥
యోసౌ సర్వతమస్సర్వ, నామా సనాతనః
అలిప్త స్సర్వభావేషు, శ్రీరామ శ్శరణంమమ ॥
బహిర్మర్త్యా దిరూపేణ, సద్ధర్మమను పాలయన్
పరిపాతిజనాన్దీనాన్, శ్రీరామ శ్శరణంమమ ॥
యశ్చాత్మా సంపృథక్కృత్య, భక్త ప్రేమవశంగతః
అర్చాయా మాస్థితోదేవః,శ్రీరామ శ్శరణంమమ ॥
సర్వావతార రూపాణాం, దర్శన స్పర్శనాదిభిః
దీనా నుద్ధరతే యోసౌ,శ్రీరామ శ్శరణంమమ ॥
కౌసల్యాశుక్తి సంజాతో, జానకీకంఠ భూషణః
ముక్తాఫల సమో యోసౌ, శ్రీరామ శ్శరణంమమ ॥
విశ్వామిత్ర మఖత్రాతా, తాటకా గతిదాయకః
అహల్యా శాపశమనః, శ్రీరామ శ్శరణంమమ ॥
పినాక భంజనశ్శ్రీమాన్, జానకీ ప్రేమపాలకః
జామదగ్న్య ప్రతాపఘ్న, శ్శ్రీరామ శ్శరణంమమ ॥
రాజ్యాభిషేక సంహృష్టః, కైకేయీవచనాత్పునః
పిత్రాదత్త వనక్రీడ, శ్శ్రీరామ శ్శరణంమమ ॥
జటాచీర ధరోధన్వీ, జానకీ లక్ష్మణాన్వితః
చిత్రకూట తటావాసః శ్రీరామ శ్శరణంమమ ॥
మహాపంచవటీ లీలా, సంజాత పరమోత్సవః
దండకారణ్య సంచారీ,శ్రీరామ శ్శరణంమమ ॥
ఖరదూషణ సంఛేదీ,దుష్టరాక్షస భంజనః
హృతశూర్పణఖా శోభ, శ్శ్రీరామ శ్శరణంమమ ॥
మాయమృగ విభేత్తాచ, హృతసీతాను తాపకృత్
జానకీ విరహాక్రోశీ, శ్రీరామ శ్శరణంమమ ॥
లక్ష్మణానుచరోధన్వీ, లోకయాత్రావిడంబకః
పంపాతీరే కృతాన్వేషః, శ్రీరామ శ్శరణంమమ ॥
జటాయుత్రాణ కర్తాచ,కబంధగతి దాయకః
హనుమత్కృత సాహిత్య, శ్శ్రీరామ శ్శరణంమమ ॥
సుగ్రీవ రాజ్యదశ్శ్రీశో, వాలినిగ్రహకారకః
అంగదా శ్వాసనకరః,శ్రీరామ శ్శరణంమమ ॥
సీతాన్వేషణ నిర్ముక్త,హనుమత్ప్రముఖవ్రజః
ముద్రానివేశితబల,శ్శ్రీరామ శ్శరణంమమ ॥
హేలోత్తారిక పాథోధి, ర్ధూత నిర్ధూత రాక్షసః
లంకాదాహకరోధర, శ్శ్రీరామ శ్శరణంమమ ॥
రోషసంబద్ధ పాథోధి, ర్లంకాప్రాసాదరోధకః
రావణాది ప్రభేత్తాచ, శ్శ్రీరామ శ్శరణంమమ ॥

జానకీ జీవనత్రాతా, విభీషణ సమృద్ధిదః
పుష్పకారోహణాసక్తః, శ్రీరామ శ్శరణంమమ ॥
రాజసింహాసనా రూఢః, కౌసల్యానంద వర్ధనః
నామ నిర్ధూతనిరయః, శ్రీరామ శ్శరణంమమ ॥
యజ్ఞకర్తా యజ్ఞభోక్తా, యజ్ఞభర్తా మహేశ్వరః
అయోధ్యాముక్తి దశ్శాస్తా, శ్రీరామ శ్శరణంమమ ॥
ప్రసన్నః సర్వధర్మజ్ఞో, మామేకం శరణంగతిః
పఠన్నిదం మమస్తోత్రం,ముచ్యతే భవబంధనాత్ ॥

శ్యామం వారిజపత్ర నేత్రమమలం, ప్రజ్ఞాన మూర్తింహరిం విద్యుద్దీప్తపిశంగ రమ్యవసనం, భాస్వత్కిరీటోజ్జ్వలమ్ కర్ణాలంబిత హేమకుండల, లసద్భ్రూవల్లి మత్యద్భుతం శ్రీమంతం భగవంత మిందుసహితం శ్రీజానకీశం స్మరేత్.

దీనిని జపాంతమున నర్థాను సంధానముతోఁ బఠింపవలయును. మనోరర్థాను సంధానం, జపాత్కోటిగుణం ఫలమ్మని శాస్త్రమునందుండుటచే నీ సమాజమువారు మంత్రార్థమును స్మరించుచు జపింపవలయును. ఎవరే మంత్రముపదేశించెదరో యా మంత్రార్థమును వారివలననే తెలిసికొనుటబాగు. మంత్ర తత్త్వార్థమును జెప్పనేరని గురువులు గురువులుకాదు. చిలుక పలుకులవలె మంత్ర ముచ్చరింపఁగనే ప్రయోజనము లేదు.

తల్లులారా! తండ్రులారా ! యిప్పుడు మీకర్పించిన మంచి ముత్తెముల నెట్లుపయోగించెదరో చూచి సమాధి మొదలగు తక్కిన విషయములు మఱియొకసారి చెప్పెదను. క్షమింపుఁడు.

శ్రీరామార్పణమస్తు.

శ్రీరామసేవ.

# ధ ర్మ వై ద్య శా ల.

వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట.

భవరోగర్తులకు నార్తికొలంది నౌషధ మీయఁబడును.
అధ్యక్షవైద్యుఁడు....సీతారామభూపాలుఁడుగారు.
సహాయవైద్యుఁడు రామదాస సంజీవరాయుఁడుగారు.
వినియోజనకుఁడు.....వాసుదాసుఁడు.
ఔషధము....శ్రీరామతారకమను దివ్యామృత రసాయనము.
అనుపానము....శ్రీరామకోటి-శ్రీరామద్వయము శ్రీరామ భజనము.
పథ్యము......సదాచారముతోడి యనుష్ఠానము.
అపథ్యము....సదాచారముతోడి యనుష్ఠానము.
అపథ్యము....దుష్టాహారము-దుష్టసహవాసము దుశ్చేష్ట.
మందువెల....భక్తిశ్రద్ధలతోడి మనస్సు.
ఫలము....శాశ్వతానందము.
ఔషధసేవకు యోగ్యులు....వివేకముగల యార్తులు.

==========

## వై ద్యు ని క ట్న ము.

అపథ్యమున కాశపడి వైద్యునకు ఔషధమునకు వైద్యశాలకు నపకీర్తి తేక యుండుటయే రోగులు వైద్యున కీయవలసిన కట్నము.

పథ్య ముండఁజాలనివా రౌషధమున కాశపడవలదు.

శ్రీరామాయనమః

# అ ను ష్ఠా న క్ర మ ము.

===========

మొదట దేవపూజా గృహమును దేవునిముందర నలికి ముగ్గుపెట్టి పూజాపాత్రములనెల్ల శుద్ధిచేసియుంచి పూజావస్తువులనెల్ల సేకరించి వానిని పరిశుద్ధపాత్రమునందుంచి దీపపు సెమ్మెలలో వత్తులు చమురు వేసి యుంచుకొని స్నానముచేసి యెండవేసిన మడివస్త్రమునుగాని నారవస్త్రమునుగాని పట్టువస్త్రముగాని ధావళిగాని కట్టుకొనవలయును. దూదితోనేసిన వస్త్రము లేనాఁటి కానాఁడు తడిపి యారవేయవలయును గాని నారవస్త్రములు పట్టువస్త్రములు మైల పడకుండినయెడల పదిదినముల కొకసారి తడిపి యారవేయవచ్చును. కంబళులు ధావళులు సాలువలు నెండలోవేసి జాడించినఁ జాలును. ఆవల నఱచేతిలో నీళ్లుపోసికొని 'ఉత్తిష్ఠంతు భూతపిశాచా' 'అవసర్పంతుయే భూతా' అను మంత్రములతో నానీళ్ళనుమంత్రించి కూర్చుండుచోటఁ జల్లవలెను. అవి రానివారు

గీ. భూమికిని భారమైనట్టి భూతములును
సత్క్రియావిఘ్నశీలపిశాచతతులు
శౌరిశాసన మిది; లేచి చనుఁడు దవ్వు;
స్వామిపూజదికములను జరపువాఁడ
దాన

అని చెప్పి తొమ్మిదిమార్లు మూలమంత్రముతో జలమును నభిమంత్రించి కూర్చుండుచోటఁ జల్లవలయును.

ఆవల దానిపైఁ బీఁటగాని అదిలేనియెడల వస్త్రమో కంబళమో నేలఁ బఱిచి కూర్చుండవలయును. ఉత్తకొయ్యపీఁటగాని ఱాయిగాని నేలగాని పనికిరాదు. ఇట్టు కూర్చుండి స్త్రీపురుషులు వారివారి సంప్రదాయానుసారముగ ముఖమునఁ బుండ్రాదుల ధరింపవలయును. సప్రాణాయామముగ త్రైవర్ణికు లావల సంధ్య వార్వవలయును. స్త్రీలును తక్కినవారు అట్లుకూర్చుండి కేశవాది నామములు పఠింపవలయును. ఆవల గురుధ్యానము కావించి యిష్టదేవతకు నమస్కరింపవలయును. ఆవల ద్వితీయ సోపానమునం దుండువారు విధిగ లఘు ప్రాణాయామమును తృతీయసోపానమునం దుండు వారుత్తమ ప్రాణాయామమును భక్తికొలఁది గావింపవలయును. ఆవల నియతిప్రకారము జపము గావింపవలయును.

ఆవల దేవపూజ గావింపవలయును. సందర్భానుసారముగ ముందు దేవపూజచేసి యావల జపము చేయవచ్చును.

---- గురుధ్యానము (సంస్కృతమురానివారికి) ----

కం. గురునిఁ దద్గురులను నేఁ
గరయుగములు మోడ్చిమ్రొక్కి కరము నుతింతున్
బరమగురుల,జగదాదిమ
వరజాయపతుల, విష్ణువల్లభ శ్రీశున్

గీ. తెలిచి ప్రాచార్య నరసింహ దేశి కేంద్రు

మద్గురుని వాసుదాసుని,మహితభక్తి
నిరతుఁ, గోదండరఘురామచరణవంక
జాతషట్పదు,మ్రొక్కెద సంతతంబు.

గీ. ఆంధ్రవాల్మీకి విఖ్యాతు నమలచరితు
భక్తివైరాగ్య ధీనిధి బ్రాహ్మణేంద్రుఁ
రామచంద్రతనూజాతు రమ్యశీలుఁ
సన్నుతించెద మ్రొక్కెద సంస్మరింతు.

--- మానసిక సన్నానము ---

నీట స్నానముచేసినను జేయకున్నను మానసికస్నానమును స్త్రీలు పురుషు లందఱు చేయవలయును. దీనిని విడువరాదు. ఆమంత్రకవారుణస్నానము (నీటమునుఁగుట) వలనఁ గలుగు ఫలమునకంటె దీనివలన నెక్కువ శుభఫలము లభించును. మంత్రస్నానముకంటె నిది యెంతయు శ్రేష్ఠము.

ఈ క్రింది పద్యమును బఠించుచు నాకాశమున నటువంటి భగవంతుని యాకారమును సంకల్పముచేఁ గల్పించుకొని యాయన యెడమకాలి బొటనవ్రేలిగోటినుండి గంగానదివచ్చి తనశిరస్సుపైఁ బడి యందలి బ్ర

హ్మరంధ్రముమార్గన దేహము లోపలఁ బ్రవేశించి సమస్తదేహమును లోపల వెలుపలఁ గడిగి పరిశుద్ధము చేసి నట్లు ధ్యానింపవలయును.

సీ. ఆకాశసంస్థితు, హరి, మంత్రమూర్తిని
బుండరీకాక్షుని, బుణ్యనిధిని
వాసుదేవుని,జతుర్బాహు, ననంత భా
స్కరసన్ని కాశునిఁ, జక్రహస్తు
శంఖగదాధరు జలపాతపాణిని
గనకాంబరుని,నీలఘనశరీరు
శాంతచిత్తుని, దివ్యచందనలిప్తదే
హుని, జారుహాసుని, నుజ్జ్వలాంగు
వనమాలికావృతు.వైజయంతీపరి
శోభితు, నారదసురమహర్షి
చయసేవితుని, మహాస్వర్ణకిరీటకే
యూరవిభూషితు, హారిహారుఁ
బద్మవజ్రధ్వజ భానురనిర్మల
పాతాబ్జతలు, భక్తపాపహారుఁ
గీ. దలఁచి తత్పాదనిస్సృతజలము తనదు
తలను వ్రాలియు బ్రహ్మరంధ్రంబుఁ దూటి
మేనిలోఁ జొచ్చి వెలుపల లోనఁ గడిగి
విమలముగఁ జేసినట్లు భావింపవలయు
గీ. కోట్లకొలఁదులు తీర్థముల్ క్షోణిఁ గలవు
వానిలో నిత్యమును మున్గి వచ్చుటకును
శ్రేష్ఠ మగు నదీ స్నానంబు చేయు టరయ;
దీనినే మానసిక మనుస్నాన మండ్రు.
గీ. నిత్యమును రెండుపూఁటల నిర్మలమతి
మానసస్నాన మాడెడి మానవుండు
సకలయోగీశ్వరులు గోరి శ్రమముపడెడు
శౌరిసాయుజ్యమును బొందు సత్యముగను.

తడి వస్త్రములతో జపతపంబులు చేయరాదు.ఎండిన వస్త్రము ధరింప సాధ్యముగానపుడు తడివస్త్రమును బాగుగ నీరు పోవునట్లు పిండి యేడుమార్లు గాలిలో విదలించినయెడల దానిని శస్త్రార్ధ మెండువస్త్రముగ స్వీక రింపవచ్చును.స్నానము చేసిన వెంటనే పుండ్రము ధరింప వలను పడనపుడు నీటితో నూర్ధ్వపుండ్రమును ధరింపవలయును.పాడుమొగముతో దేవకార్య మేదియుఁ జేయరాదు.

ముత్తైదువ లీమంత్రమును జపించుచు ముఖముల యందుఁ గుంకుమము ధరింపవలయును.

శ్లో ॥ శ్రీ ర్లక్ష్మీ కమలా పద్మా పద్మినీ కమలాలయా
రమా వృషాకపీ ధన్యా వృద్ధిర్యజ్ఞా తథేదిరా ॥

ధ్యానశ్లోకమును సంస్కృతమున జపింపలేనివారీ క్రింది పద్యమును పఠింపవలయును.

అర్థము తెలియక, యధికారములేక,యుచ్చారణ దక్షత లేక,సంస్కృతమునఁ బఠించుట శ్రేయస్కరము కాదు.

---- ధ్యానపద్యము ----

సీ. కమనీయమేచక ఘనకాంతికాంతుని
వీరాసనస్థుఁడై వెలయువానిఁ
దన కేల జ్ఞానముద్రను ధరించినవాని
నెడమ కేల్ మోఁకాట నిడినవానిఁ
దొలికారుమెఱుపుతోఁ దులయించు మేనితో
హస్తాంబుజమున దివ్యాబ్జ మమరఁ
దనపార్శ్వముననుండి తన్నె విలోకించు

ధరణీతనూజతోఁ బరఢవించి

గీ. మకుట కేయూర నిర్మలమౌ క్తి కాది
కమ్రమణిదీప్తహారకంకణసుకుండ
లోజ్జ్వలితగాత్రుఁ డగుచును నొప్పుమీఱు
రాము భజియింతు భక్తిపురస్సరముగ.

---- పూజావిధానము ----

సీ. ధ్యాన మొనర్చెద జ్ఞానస్వరూపుని
నావాహన మొనర్తు హరిని దరిని
ఆసనం బర్పింతు నహితల్పశాయికి
నర్ఘ్య మిచ్చెద దేవతార్థితునకుఁ
బాద్య మిచ్చెద వామపాదనఖోద్భూత
దివ్య భాగీరథీతీర్థునకును
స్నానంబుఁ గల్పింతు బలధి నివాసికి
వస్త్రంబు సంబరపాదునకును
చందన మలఁబెద నందనమందార
చందనామెద ప్రశస్తునకును
యజ్ఞోపవీతంబు యజ్ఞమూర్తికి నిత్తు
ధూపంబు నిత్తు నిర్లేపునకును
దీప మర్పించెద దివ్యతేజునకును
సుమము లర్పించెద సురనుతునకు
అమృతోపహారంబు లమృతమూర్తికి నిడి
తాంబూల మిడుదు సీతావిభునకు
నఖిలోపచారంబు లర్థిమై శ్రద్ధతో
శక్తి దప్పిన మది భక్తి చెడక

గీ. యెలమిఁగావించి వలగొని లలితమతిని
మరల మరల నమస్కృతుల్ దిరముభక్తి
సలిపి ధ్యానించి మదినుంచి సన్ను తించి
నుభయవిధపూజఁ గావింతు నుల్లమలర.

దేవున కర్పించు గంధమును స్నానముచేసినవారు మడితోఁ దీయవలయును గాని మైలవారు తీయరాదు. దీపమునకు నెయ్యి, నూవులనూనె,యిప్పునూనె,వేరుసెనగనూనె యుపయోగింపవచ్చునుగాని యాముదము గబ్బునూనె వేఁపనూనె కానుగుచేఁదు నుపయోగింపరాదు. దేవుని దీపంబును పుల్లతో వెలిఁగించినయెడలఁ గొఱవిదయ్యము లగుదురు. అడ్డవత్తులను ముందు వెలిఁగించి వానితో ముఖ్యదీపము వెలిఁగింపవలయును.

వాసనలేనిపూలు నెత్తురురంగుగలపూలు దుర్గంధము గలపూలు నల్లనిపూలు అక్షితలు వీనిచే విష్ణుమూర్తిని బూజింపరాదు. శివునికి మొగలిపూలు పనికిరావు. అశుద్ధప్రదేశమునఁ బుట్టినవి, అప్రసిద్ధమైనవి,స్మశానాదులందుఁ బుట్టినవి,పురుగులుండునవి ఎఱ్ఱగన్నేరు ఇవి విష్ణుపూజకుఁ బనికిరావు. మూ చూచినవి ఒకరు ధరించినవి పనికిరావు.

ఆదిత్య మంగళ శుక్రవారములందును, సంక్రాంతి అమావాస్య పూర్ణిమలయందును సాయంసంధ్యయందును,మధ్యాహ్నముమీఁదను ద్వాదశియందును,దులసిని గోయరాదు. ముందు దినమందే కోసియుంచవలెను. నాలుగు లేక యాఱుకంటె నెక్కువగ నాకులుగల దళములఁ గోయరాదు. కోయునప్పుడు గోరుతగులరాదు. తులసిగోయువారు ముందీ శ్లోకములఁ జెప్పి ధ్యానించి ప్రదక్షిణించి నమస్కరించి యవలఁ గోయవలయును.

శ్లో ॥ తుల స్యమృతజన్మాసి, సదా త్వం కేశవప్రియే
కేశవార్థం లునామిత్వాం, వరదా భవ శోభనే
మోక్షహేతో ర్ధరణిప్రసూతే
విష్ణో స్సమస్తస్య గురోః ప్రియతే
ఆరాధనార్థం పురుషోత్తమస్య

